# "ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ, ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక, సరదాగా యిది చెయ్యాలింక"— ఫేవీ ఫెయిరీ



"ఇంద్రజాలం కానే కాదిది
చేత్తోచేసే తమాషా యిది
డబ్బుతోనూ పనియే లేదు
దీనికి యిక మరి తిరుగేలేదు."
"ఏమిటిదంతా యిదొచ్చి చెప్పు
ఏంచెయ్యాలో దబ్బున చెప్పు."
"రండర్రా యిటు రండర్రా
చెప్పేదేదో వినిపొండర్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బుట్టయినా
ఏ పర్సయినా చేసెయ్యొచ్చు
పట్టుకోకనే పట్టుకునేదిది
మురికి కానిది ముచ్చటైనది
సరదా సరదా తమాషాయిక
బొమ్మేదైనా చేసెయ్యింక"

సీతాకోక చిలుక ఎలా తయారుచెయ్యాలి అనే తీరుని ఉచితంగా పొందటం కోసం ఈ కూపన్ పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి : "ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020.

సీతాకోక చిలుక ఎలా తయారు చేయ్యాలి అనే తీరుని ఉచితంగా పొందటంకోసం ఈ కూపన్‌ను చిరునామాకు వ్రాయండి : "ఫెవీ ఫెయిరీ," పోస్ట్ బాక్స్ 11084 బొంబాయి 400 020.

పేరు : ______

వయస్సు : ______

చిరునామా : ______

______

**ఫెవికాల్** ఎమ్ ఆర్
సింథెటిక్ ఎడ్హెసివ్




**బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది, ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది**

® ఇది మరియు ఫెవికాల్ (బ్రాండ్ రెండూ పిడిలైట్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్, బొంబాయి 400 021 వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్స్ గలవి.

OBM-1214 TL

# జలుబు మిమ్మల్ని విడవకుండా పీడిస్తోందా?

మామూలు మందులు జలుబుని కేవలం కొద్ది గంటల పాటు నిద్రపుచ్చగలవు అంతే.

ఆయుర్వేదంలో జలుబుని పూర్తిగా పోగొట్టే ఓ ఆయుధం ఉంది.

మామూలు మందులు జలుబుతో పోరాడవు. దానివల్ల వచ్చే ఇబ్బందుల్ని కాస్సేపు మాత్రం అణచి ఉంచుతాయి.

ఆయుర్వేద త్రిశూన్ మీ శరీరంలో నిరోధక శక్తిని పెంపొందిస్తుంది. ఆ విధంగా జలుబుని ఎదుర్కొనేలా చేస్తుంది.

మీరు త్రిశూన్‌ని మొదటి జలుబు లక్షణం కనపడగానే వాడారంటే జలుబుని సమర్థంగా నిరోధించవచ్చు.

మోతాదు: ఒక్కొక్క మాత్ర చొప్పున రోజుకి రెండుసార్లు. జలుబు అప్పుడే ప్రారంభమవుతూంటే, త్రిశూన్ ఒక్క రోజు తీసుకోండి. జలుబు తీవ్రంగా ఉంటే త్రిశూన్ 2½ రోజులు తీసుకోండి. టీ, కాఫీ లేదా వెచ్చటి నీటితో తీసుకోవాలి.



**Trishun** त्रिशून

జలుబుకు తిరుగులేని జవాబు






జండూ ఫార్మసూటికల్ వర్క్స్ లిమిటెడ్.
గోఖలే రోడ్ సౌత్, దాదర్, బొంబాయి 400 025

Trikaya.ZP.2.86 TEL

వాడి వయస్సు ఆరు
కాని బుర్రనిండా చమత్కారాలు.

ఎదిగే పిల్లలకేం కావాలో ఆమెకు తెలుసు!




ఆంప్రో®
మిల్క్ బేస్
పుష్టి కరమైన
బిస్కట్లు




SISTA'S/EIPL/90/87 Tel

మీకోసం చందమామ అందిస్తూన్న అపూర్వ కానుక!

# మహోన్నత భారతీయ సంస్కృతి పోటీ

## ఉత్తేజకరమైన మూడు భాగాలలో

**పోటీ : 1**

గొప్ప భారతీయ రాజులు



**పోటీ : 2**

గొప్ప భారతీయ రాణులు



**పోటీ : 3**

గొప్ప భారతీయ జంటలు



### ప్రతి పోటీలోనూ 11 భాషలలో గెలుచుకోనున్న గొప్ప బహుమతులు

11 ప్రథమ బహుమతులు : **2,000** రూపాయలు స్కాలర్‌షిప్
11 ద్వితీయ బహుమతులు : **1,000** రూపాయలు స్కాలర్‌షిప్
11 తృతీయ బహుమతులు : **500** రూపాయలు స్కాలర్‌షిప్

### ఇంకా బంపర్ ప్రైజులు

ప్రథమ బంపర్ : **10,000** రూపాయలు స్కాలర్‌షిప్ *
ద్వితీయ బంపర్ : **5,000** రూపాయలు స్కాలర్‌షిప్ *
తృతీయ బంపర్ : **2,500** రూపాయలు స్కాలర్‌షిప్ *

* ఐదేళ్ళవరకు ఐదు సమాన వాయిదాలలో

220 కన్సొలేషన్ బహుమతులు : చందమామకు ఒక యేడాదిపాటు ఉచిత చందాలు.

పోటీ: 1 వివరాలకు చందమామ సెప్టెంబర్ సంచిక చూడండి. మూడు పోటీలలోనూ తప్పక పాల్గొనండి. బంపర్ ప్రైజుకు కూడా ప్రయత్నించండి!

HTA 7076



రారెవ్వరూ నాకు జ్వరమని
వేరెవ్వరు నాకింక తోడని

ఆలోచించా నేనేదో చెయ్యాలని
ఇంట్లో అందరి సరదాతీర్చాలని

ఇవిగో పెన్నులు, అదిగో కాగితం
ఎకో రంగులతోనే నాకింక స్నేహం.

గీసేస్తా గీతలతోనే ఓ బొమ్మ
మురిసిపోయి ముద్దివ్వాలి మా అమ్మ

ఎకో పచ్చ, ఎకో నీలం
ఎరుపు పసుపు నారింజ రంగులమయం

ఊదా, నలుపు, వైలెట్
గులాబీ, గోధుమలతో అయ్యేనది ఓసెట్

# ఎకో

ెచ్ పెన్ రంగులే ఇక రంగులు- సరదాతీర్చే హంగులు!



# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["సేవకుడిసలహాలు"]కు ఆధారం, ఎస్. శివనాగేశ్వరరావు రచన. ఏ మారుమూలనో వున్న పల్లెల్లో, ప్రజలు ఎలాంటి యిక్కట్లకు గురిఅవుతున్నారో, వాటిని ఎలా పరిష్కరించాలో, రాజధానీ నగరంలో వున్న పాలకుడికి తెలిసే అవకాశం తక్కువ. ఈ విషయంలో రాజోద్యోగులు తమ బాధ్యత మరచినప్పుడు, ఫలితం ఏమిటో, ''రాజదర్శనం'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

ఉత్తమః క్లేశవిక్షోభం, క్షమః సోఢుం న హీతరః
మణిరేవ మహాశాణఘర్షణం, న తు మృత్కణః

[ఉత్తములు మాత్రమే కష్టనష్టాలనూ, దుఃఖాన్నీ ధైర్యంతో ఎదుర్కొగలరు. అది సామాన్యులకు సాధ్యపడదు. సానరాతి రాపిడికి మణి మాత్రమే నిలవగలదు; మట్టిగడ్డ నిలవజాలదుగదా!]

సంపుటి 81 అగస్టు '87 సంచిక 2

విడి ప్రతి : 2-50 : : సంవత్సర చందా : 30-00



# చందమామ కబుర్లు

## ఎగిరే రైలుబండి!



గాలిలో ఎగిరే రైలుబళ్ళను జపానులో ప్రవేశపెట్టనున్నారు. ఈ బళ్ళు గాలిలో ఎగరడానికి రెక్కలుగాని, ప్రొపెల్లర్ల్‌లాంటి యంత్రాలుగాని లేవు. అయస్కాంత శక్తితో ఇవి నడుస్తాయి.

## 3,000 సంవత్సరాలనాటి లంగరు!

తమిళ విశ్వవిద్యాలయానికి చెందిన జలాంతర్గత పురా తత్వ శాఖా విభాగ సభ్యులు, ఇటీవల మన్నార్ జలసంధికి అవతల ఒక లంగరును కనుగొన్నారు. దాదాపు ఒక టన్ను బరువు గల ఈ లంగరును భారతీయ నావికులు 3,000 సంవత్సరాల క్రితమే ఉపయోగించారని భావిస్తున్నారు.





## గుర్తు తెలియని ఎగిరే పళ్ళాలు

చైనాలోని సెంట్రల్ ప్ర్యుయల్ ప్రాంతంలో ఇరవై మందికి పైగా, వినీల ఆకాశంలో నలభై నిమిషాలపాటు నారింజరంగు పళ్ళాలు ఎగరడం చూసి ఎంతో ఆశ్చర్యం చెందారు.

## కోటలో బంగారం!

తిరుపతికి సమీపంలోని చంద్రగిరికోటలో, పన్నెండేళ్ళ కుర్రవాడొకడు నేలను తవ్వుతూ వుండగా ఒక కుండనిండా బంగారు నాణాలు బయట పడ్డాయి. వెంటనే అతడు ఆ విషయం పోలీసులకు తెలియజేశాడు. ఆ నాణాలు విజయ నగరం రాజులనాటి కాలానికి చెందినవని తెలియవచ్చింది.



# కంథుడు

కణ్వముని కుమారుడైన కంథుడు, గోమతీ నదీతీరంలో తపస్సు ప్రారంభించాడు. కఠోరమైన కంథుడి తపస్సుకు భంగం కలిగించడానికి, ఇంద్రుడు ప్రమ్లోచన అనే అప్సరసను పంపాడు. ప్రమ్లోచన గోమతీ తీరం చేరుకుని, తన అందచందాలతో, మనోహరమైన ఆటపాటలతో, కంథుడి మనసులో చలనం కలిగించింది. ఆమె అపురూప సౌందర్యానికి ముగ్ధుడై కంథుడు ఆమెను పెళ్ళాడాడు.

రోజులు నెలలుగా, నెలలు సంవత్సరాలుగా కాలం గడవసాగింది. అప్సరస సాహచర్యంలో, కంథుడు హాయిగా ఐహిక సుఖాలు అనుభవిస్తూ, జపతపాలమాట మరిచిపోయాడు.

ఒకసారి సాయంకాలం, కంథుడు కొండశిఖరం మీద ఏకాంతంగా కూర్చుని, సూర్యాస్తమయ దృశ్యాన్ని తదేకంగా చూడసాగాడు. హఠాత్తుగా అతనికి సాయంసంధ్య ధ్యానసమయం అన్న స్పృహ కలిగింది. చటుక్కున లేచి నిలబడి, ధ్యానంలో కూర్చోవడానికి జింకచర్మం కోసం అటూ ఇటూ వెదక సాగాడు. ఆ సమయానికి అక్కడికి వచ్చిన ప్రమ్లోచన అతణ్ణి చూసి పకపకా నవ్వింది.

ఆమె నవ్వుకు ఆశ్చర్యపడి, "ఎందుకలా నవ్వుతావు?" అని అడిగాడు కంథుడు.

"నవ్వక మరేం చేయమంటారు? ఇన్ని వందల సంవత్సరాల తరవాత మీకు జపతపాల సంగతి గుర్తుకు వచ్చింది కదా?" అన్నది ప్రమ్లోచన.

"వందల సంవత్సరాలా?" అన్నాడు కంథుడు ఆశ్చర్యంగా.

"అవును! మీరు జపతపాలు మాని నన్ను పెళ్ళాడి, తొమ్మిది వందల సంవత్సరాలా, ఆరు నెలలా మూడు రోజులు అయినాయి!" అన్నది అప్సరస మళ్ళీ నవ్వుతూ.

"అలాగా!" అంటూ కంథుడు సిగ్గుతో తల వంచుకుని, కాలం వృధా అయినందుకు పశ్చాత్తాప పడి, అక్కడి నుంచి మరొక ప్రశాంతస్థలానికి వెళ్ళి, తపస్సు ప్రారంభించాడు. ఆ తరవాత అతనికి ఎటువంటి ఐహిక సుఖాలూ అంతరాయం కలిగించలేదు. అచిరకాలంలోనే తపోసిద్ధి పొందాడు.





# రాజదర్శనం

రామగిరి అనే గ్రామంలో వుండే శ్రీచాలుడికి, పేరులో తప్ప మరెక్కడా డబ్బు లేదు. వాడు, నలుగురిళ్ళలో పనిచేస్తూ, వాళ్ళిచ్చిన డబ్బుతో పొట్టపోసుకుంటూ, కాలం వెళ్ళబుచ్చుతున్నాడు.

ఒకరోజున, ఆ గ్రామానికి చెందిన శివయ్య అనే కళాకారుడు, రాజధానిలో తన విద్యను ప్రదర్శించి, తిరిగివచ్చాడు. వెళ్ళేటప్పుడు సామాన్యంగా వున్న శివయ్య, యిప్పుడు గొప్ప ధనవంతుడై పోయాడు.

ఇది శ్రీచాలుడికి చాలా ఆశ్చర్యం కలిగించింది. వాడు, శివయ్యను కలుసుకుని, రాజును గురించిన వివరాలడిగాడు.

అందుకు శివయ్య, ఎంతో సంతోషపడిపోతూ, "మన దేశపు రాజుగారిని గురించి ఎన్ని విశేషాలైనా చెప్పవచ్చు. ఆయన సాక్షాత్తూ అవతారపురుషుడు. కత్తిబట్టి నిలబడితే, వరమదాంధులైన రాక్షసులు కూడా పారిపోవలసిందే. సిరి సంపదలలో కుబేరుడు కూడా, ఆయనతో సరితూగలేడు. దానగుణంలో శిబి, బలి, కర్ణుడు మొదలైనవారాయనవద్ద, పాఠాలు నేర్చుకోవాలి. అన్నింటినీ మించిన గొప్ప విశేషం—మన రాజుగారికి, ప్రజల బాగోగుల గురించి మినహా, వేరే ఆలోచనలేకపోవడం!" అని చెప్పాడు.

ఒకరోజులో, శివయ్య జాతకం మార్చివేసిన రాజుగారి విషయంలో, యివన్నీ నిజాలే అయివుండాలనుకున్నాడు, శ్రీచాలుడు. వాడు చాలామంది దగ్గిర, యీ సంగతే చెప్పాడు. అప్పుడు వాడికి, రాజు గురించి మరికొన్ని సంగతులు తెలిసినై.

రాజు, ప్రజలకోసం ఎన్నో మంచి పనులు చేస్తున్నాడు. పంటలు పండని

జొన్నలగడ్డ రామలక్ష్మి



ప్రాంతాన పన్నులు తగ్గిస్తున్నాడు. కరువు ప్రాంతాల్లో, తిండిగింజలను ఉచితంగా పంచింపచేస్తున్నాడు. దేశంలో పేదరికం అన్నది లేకుండా చేయాలని, ఆయన కంకణం కట్టుకున్నాడు.

ఎంతోకాలంగా పరుల పంచన బతుకుతున్న శ్రీచాలుడికి, యీ విషయాలేమీ తెలియవు. ఇవన్నీ తెలియగానే, వాడికి రాజును చూడాలన్న కోరిక కలిగింది. ఆరోజునుంచీ వాడు, తన ప్రయాణానికి డబ్బు కూడబెట్టసాగాడు. అందుకోసం వాడు, పస్తులు కూడా వుండేవాడు.

ఏమైతేనేం—ఒక సంవత్సరంతర్వాత, వాడు చిన్న మూట ఒకటి భుజాన వేసుకుని రాజధానికి చేరుకున్నాడు. వాడు రాజదర్శనంకోసం కాపలాభటులనడిగితే, వాళ్ళు పకపక నవ్వి, "నీవంటివాళ్ళను చూడడానికి కాలం వృధా చేస్తే, రాజుగారిక ప్రజలను పాలించినట్టే!" అన్నారు హేళనగా.

"ఒక్కసారి, ఆయన దర్శనం చేసుకుని వెళ్ళిపోతాను. ఆయననేమీ కావాలని అడగను," అన్నాడు శ్రీచాలుడు.

అయినా, కాపలావాళ్ళు లోనికి పోనీయలేదు. శ్రీచాలుడు నిరుత్సాహంతో, అక్కడినుంచి బయలుదేరాడు. వాడి అవస్థ గమనించిన పౌరుడొకడు, శ్రీచాలుణ్ణి పలకరించి, సంగతి తెలుసుకుని, "నువ్వు తొందరపడి, మీ గ్రామానికి వెళ్ళిపోకు. ప్రతిరోజూ కాపలావాళ్ళను బతిమాలుకుంటే, ఏదో ఒకరోజున వాళ్ళు, నిన్ను లోపలికి వెళ్ళనిస్తారు," అని సలహాయిచ్చాడు.

ఇది విన్న తర్వాత, వాడు రాజును చూడకుండా, తన గ్రామానికి తిరిగి పోకూడదనుకున్నాడు.

అయితే, ఆనాటి రాత్రి వాడికి ఒక పెద్ద సమస్య ఎదురయ్యింది. గ్రామంలో అయితే, ఏ ఇంటి అరుగుమీదో పడుకుని నిద్రపోయేవాడు. ఇక్కడ ఏం చేయాలో వాడికి తోచలేదు. ప్రతి వీధికీ కాపలా

భటులున్నారు. వాళ్ళు కొత్తవాళ్ళెవర్నీ వీధులలో వుండనివ్వడంలేదు. శ్రీచాలుడు, వాళ్ళకు తన పరిస్థితి చెప్పుకున్నాడు.

''ఇంటి అరుగులమీద, కొత్తవాళ్ళు పడుకుంటే, మా కాపలావల్ల ప్రయోజనం వుండదు. నీవంటివాళ్ళుండడానికి, ధర్మ సత్రాలున్నవి. కానీ, ఈ రాత్రివేళ వాటిలో ప్రవేశించడం కష్టం. ఏ సమయంలో అయినా, కొత్తవాళ్ళను ఆదరించే సత్రాలు, నగర ప్రవేశద్వారాలవద్ద వుంటవి. నువ్వక్కడికి వెళ్ళు.'' అన్నారు భటులు.



వాడు, భటులనడిగి దారి తెలుసుకుని బయలుదేరాడు. అయితే, వాడికి నగర వీధులు గజిబిజిగా కనిపించి, కొంతసేపు అక్కడే తిరుగుతూ, చివరికి ఒక మైదాన ప్రాంతం చేరాడు.

శ్రీచాలుడు అక్కడ కొంతసేపు విశ్రమిద్దామనుకుంటూండగా, ఎక్కడి నుంచో ఒక వ్యక్తి వచ్చి, ''ఎవరునువ్వు? ఇంత రాత్రివేళ, యిక్కడేంచేస్తున్నావు?'' అని అడిగాడు.

శ్రీచాలుడు, అతడికి తన కథ చెప్పుకున్నాడు.

''రాజును చూడడానికి, కష్టపడి యిక్కడికి వచ్చి, యిలా తిరుగుతున్నావంటే, నమ్మతగ్గ మాటగాలేదు. నువ్వు దొంగవని, నాకనుమానం కలుగుతున్నది. ఆమూటవిప్పిచూపించు.'' అన్నాడావ్యక్తి.

శ్రీచాలుడు సంకోచించకుండా, మూట విప్పి చూపించాడు. అందులో, ధనికులు మాత్రమే ధరించగల విలువైన దుస్తులూ, తళతళమెరిసే కొత్త చెప్పులూ వున్నవి.

ఆ వ్యక్తి, శ్రీచాలుణ్ణి పరీక్షగా చూశాడు. వాడు చింకి బట్టలతో, బికారిలా వున్నాడు.

''ఇవి నీవికాదు. ఎక్కడో దొంగిలించావు, అవునా?'' అని కఠినంగా ప్రశ్నించాడా వ్యక్తి.

''ఒక సంవత్సరంపాటు, కడుపు మాడ్చుకుని కూడబెట్టిన డబ్బుతో, యివి కొన్నాను. ఎక్కడా దొంగిలించలేదు,'' అన్నాడు శ్రీచాలుడు దీనంగా.



"అలా కొంటే, ఈ దుస్తులూ, చెప్పులూ ఎందుకు ధరించలేదు?" అని ప్రశ్నించాడా వ్యక్తి.

"వీటిని రాజదర్శనం కోసం దాచుకున్నాను. కాపలావాళ్ళు, నన్ను లోపలికి పోనిస్తానంటే, వెంటనే యివి ధరించి, రాజుగారి కళ్ళ పడాలనుకున్నాను," అన్నాడు శ్రీచాలుడు.

"ముందుగానే ఎందుకు ధరించకూడదు?" అని అడిగాడావ్యక్తి ఆశ్చర్యపోతూ.

"ముందుగానే ధరిస్తే, నలిగి పాడై పోతాయని, నా భయం," అన్నాడు శ్రీచాలుడు.

"నువ్వు, రాజును చూడాలనుకుంటున్నావు తప్ప, రాజు నిన్ను చూడాలనుకోవడంలేదు. అలాంటప్పుడు, రాజును చూడడానికింత మంచి దుస్తులెందుకు? నువ్వేదో దాస్తున్నావు," అన్నాడావ్యక్తి.

శ్రీచాలుడు కొద్దిసేపు తలవంచుకు పూరుకుని, "అయ్యా, ఈ దేశపు రాజు అవతారపురుషుడు. ప్రజల మేలుకోరి, ఆయన ఎన్నో మంచి పనులు చేస్తున్నాడు. తనకు తెలిసిన పేదవారందరికీ, ఏవో శాసనాల ద్వారా సాయపడుతూనే వున్నాడు. కానీ, ఆయనకు, నాబోటి పేదల గురించి తెలిసివుండదు. నాలాంటి వాణ్ణి చూస్తే, ఆయన మనసు బాధపడుతుంది. నేనాయనకళ్ళబడినా; నా పేదరికం ఆయన కళ్ళబడకూడదు. ఇదీ నా అభిలాష! అందుకే, యీ దుస్తుల్ని మూటలో దాచుకున్నాను," అన్నాడు.

"అయితే, జరగకూడని పనే జరిగింది. నువ్వు, నా కళ్ళబడ్డావు. నేనీదేశాన్నేలే రాజును!" అన్నాడావ్యక్తి.

శ్రీచాలుడు వెంటనే, "ప్రభూ, తమరీ దేశపు ఏలికలా? నా అదృష్టాన్ని నమ్మలేక పోతున్నాను. నా జన్మ తరించింది. కాని, యింత రాత్రివేళ, తామిలా ఎందుకు పాదచారులైనగరంలో తిరుగుతున్నారు?" అని అడిగాడు.

"ప్రజలు, నన్ను గురించి ఏమను కుంటున్నదీ తెలుసుకునేందుకు, తరచుగా నేనిలా మారువేషంలో, నగరసంచారం చేస్తూంటాను. ఈ రోజు నిన్ను కలుసుకోవడం, సంతోషమయింది. రేపు నిన్ను, కాపలా భటులు లోనికి రానిస్తారు. వచ్చి, నా దర్శనం చేసుకో. నీ పేదరికం తొలిగిపోయే కానుకలిస్తాను," అన్నాడు రాజు.

శ్రీచాలుడు మౌనంగా వూరుకున్నాడు.

అప్పుడు రాజు, వాడితో, "నీ పేదరికాన్ని స్వయంగా చూశాను. నా మంత్రులూ, కొలువు తీరిన పెద్దలూ కూడా చూడాలి. అందుకే, నీ విలువైన దుస్తులు కూడా తీసుకువెళుతున్నాను," అని, వాడి మూట తీసుకుని వెళ్ళిపోయాడు.

మర్నాడు, రాజు కొలువులో ఎంతోసేపు, శ్రీచాలుడి కోసం ఎదురు చూశాడు. వాడు రాలేదు. కాపలావాళ్ళను విచారించగా, అసలువాడా దరిదాపులకే రాలేదని చెప్పారు. అప్పుడు రాజు, భటులను పంపి, శ్రీచాలుణ్ణి రాజధానికి తెప్పించాడు.

శ్రీచాలుడు ఎంతో వినయంగా, "ప్రభూ, నేను లోగడ తమను దర్శించుకోవాలని వచ్చాను. ఆ పని కాగానే, నాకు సంతృప్తి కలిగింది. మీ నుంచి నేను, కానుకలనాశించలేదు. నా విలువైన దుస్తులు, మీ దగ్గిర వుండిపోయాయి. మీ దర్శనం అయాక, నాకు వాటితో పని లేదు. అందుకే వాటి కోసం కూడా రాలేదు," అన్నాడు.

"నీలో ఆవగింజంత స్వార్థం కూడా లేదని, నీ ప్రవర్తన చూసి తెలుసుకున్నాను. నీ కారణంగా, నా పాలనలోని కొన్ని లోపాలు తెలియడమేకాక, కోట కాపలావాళ్ళు, నాకూ ప్రజలకూ మధ్య ఎలా అడ్డుగోడల్లా తయారయారో గ్రహించాను. ఇందుకు నిన్ను సన్మానించదలచాను," అని, రాజు, శ్రీచాలుడికి విలువైన కానుకలిచ్చి పంపాడు.

ఆ తర్వాత, శ్రీచాలుడికి పేదరికం బాధలేకుండా పోయింది. అంతే కాక, రాజ్యంలో క్రమంగా పేదరికం రూపుమాపబడింది.





# అదృష్టపరీక్ష

సోమనాథపురం జమీందారు ఈశ్వర స్వామికి, తన దివాణంలో పని చేసేం దుకు, గుమాస్తా అవసరం కలిగింది. ఈ సంగతి తెలిసి, పదిహేనుమంది యువ కులు, జమీందారు దగ్గిరకు వచ్చారు.

ఆయన వాళ్ళతో, "ఉద్యోగం కోసం యింతమంది వస్తారని, నేననుకోలేదు. సరే, వినండి! మీకు ఎదురుగా, మూతలు పెట్టిన పది కుండలు వుంచబడతాయి. వాటిల్లో, ఒక కుండలో మాత్రం, ఒక బంగారు నాణెం వుంచాను. ఆ నాణెం ఏ కుండలో వున్నదో తెలుసుకున్నవారికి, ఉద్యోగం యిస్తాను. అదృష్టం మీలో ఎవరిని వరిస్తుందో పరీక్షించుకోండి," అన్నాడు.

నౌకరు ఒకడు, పది మూతలు పెట్ట బడిన కుండలు తెచ్చి, కొంత దూరంలో యువకులకు ఎదురుగా వుంచాడు. వాటికి ముందు, ఒక తెర కట్టబడింది. దానికి పక్కగా ఒక కుర్చీలో, జమీందారు కూర్చున్నాడు.

తెర ముందున్నవాళ్ళకు, ఎవరు ఏ కుండ మూత తీసి చూశారో తెలియదు. జమీందారుకు మాత్రం అది కనిపిస్తుంది.

ఒక్కొక్క యువకుడే, తెర వెనుకకు వెళ్ళి, ఏదో ఒక కుండను ఎంచుకుని మూత తీసి చూడసాగాడు. కాని, ఎవరికీ నాణెం కనిపించలేదు. ఈ విధంగా పద్నాలుగుమంది, వట్టి చేతులతో తిరిగి వచ్చారు.

ఉద్యోగం కోసం వచ్చిన రామరత్నం అనే యువకుడు మాత్రం, దూరంగా నిలబడి, అంతా గమనిస్తున్నాడు.

జమీందారు, అతడి కేసి పరీక్షగా చూస్తూ, "నువ్వూ, ఉద్యోగం కోసం వచ్చినవాడివే గదా! అలా చూస్తూ

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

నిలబడ్డావేం? నీ అదృష్టాన్ని కూడా పరీక్షించుకో," అన్నాడు.

అందుకు రామరత్నం, "అయ్యా, అక్కడ వున్న పది కుండలలో, ఒక దానిలో మాత్రం బంగారు నాణెం వుంచి, అదృష్టాన్ని పరీక్షించుకోవడమంటే— పదివంతులలో, ఒకే అవకాశం వున్నదన్న మాట. అందువల్ల, తమరనే అదృష్టం ఎవరికీ కలగకపోవచ్చు. అదృష్టాన్ని ఈ విధంగా పరీక్షించి, గుమస్తాను నియమించుకోవాలని, అనుభవజ్ఞులైన తమరు అనుకుంటున్నారన్న నమ్మకం, నాకు లేదు," అన్నాడు.

ఆ జవాబుకు జమీందారు చిన్నగా నవ్వి, "అయితే, ఈ ఏర్పాటంతా, ఏదో తమాషాకోసం చేశానని, నీ అభిప్రాయమా?" అని అడిగాడు.

"అయ్యా, నా అభిప్రాయం అదికాదు. ఉద్యోగం కోసం వచ్చిన వాళ్ళ తెలివి తేటల్నీ, మనస్తత్వాన్నీ పరీక్షించేందుకు, యీ పని చేసి వుంటారు. నా ఊహ ఏమంటే, ఆ కుండల్లో దేనిలోనూ, నాణెం లేదని. తమరేదైనా పని యిస్తే చేద్దామని వచ్చానే తప్ప, ఏదో అదృష్టాన్ని నమ్ముకుని రాలేదు," అన్నాడు రామరత్నం.

"అయితే, నువ్వు కుండల జోలికి పోదలచలేదన్నమాట, అవునా?" అని అడిగాడు జమీందారు.

"క్షమించండి! నా కిలాంటి అదృష్టాల మీదనమ్మకంలేదు," అన్నాడురామరత్నం.

ఆ మాట వింటూనే జమీందారు సంతోషంగా, "నువ్వు నాకు నచ్చావు. నువ్వు ఊహించినట్టు, నిజానికి ఏ కుండలోనూ బంగారు నాణెం లేదు. ఏదో అదృష్టం వరించడం కాక, తన బుద్ధిబలం మీద నమ్మకం వున్న, నీలాంటివాడు దొరుకుతాడేమోనని, ఈ పరీక్ష పెట్టాను. రేపే వచ్చి పనిలో చేరు," అన్నాడు.

రామరత్నానికి దివాణంలో గుమాస్తా పని దొరికింది. తమ అదృష్టాన్ని పరీక్షించుకోవాలని ఆశపడ్డవాళ్ళందరూ, నిరాశతో తిరిగి వెళ్ళారు.



# మందుప్రభావం

కొత్తగా పెళ్ళయిన మంగయ్యా, మణెమ్మా, ఊరి చివర్లో వున్న ఒక పెంకుటిల్లు అద్దెకు తీసుకుని కాపరం పెట్టారు.

వాళ్ళిద్దరిదీ మొద్దు నిద్ర. రోజూ బారెడు పొద్దెక్కాకగాని లేచేవాళ్ళుకాదు. ఆ కారణంవల్ల, పొలంపనులకు వెళ్ళడం కుదరడంలేదు.

మంగయ్య, పరిస్థితి రంగయ్య అనే స్నేహితుడికి చెప్పుకున్నాడు. అతను, చలమయ్య అనే వైద్యుడి దగ్గిరకు వెళ్ళమని సలహాయిచ్చాడు.

చలమయ్య, మంగయ్య చెప్పింది విని, "ఇంతేగదా!" అంటూ తేలిగ్గా నవ్వేసి, మందేదో తెచ్చియిస్తూ, "ఈ మాత్రలు, మీ భార్యాభర్తలిద్దరూ వేసుకోండి. పొద్దుపొడవక ముందే, ఎవరో వీపు తట్టి లేపినట్టు లేచికూర్చుంటారు," అని చెప్పాడు.

ఆ రాత్రి మంగయ్యా, మణెమ్మా ఆ మాత్రలు మింగి పడుకున్నారు. ఇద్దరికీ మెలుకువ వచ్చేసరికి, యింకా పొద్దుపొడవలేదు. ఎంతో నీరసంగా వున్నప్పటికీ, తెల్లవారుజామునే నిద్రలేవ గలిగినందుకు సంతోషిస్తూ, నలుగురికీ తన ముఖం చూపిద్దామని, మంగయ్య ఊళ్ళోకి బయలుదేరాడు.

దారిలో ఒకచోట రంగయ్య ఎదురుపడి, "ఏమిటోయ్, మంగయ్యా! మూడు రోజులుగా కనిపించలేదేం! ఊళ్ళో లేవా ఏమిటి?" అని అడిగేసరికి, జరిగింది అర్థమై, నీరసం ముంచుకు వచ్చింది మంగయ్యకు.

—దాసరి వెంకటరమణ






## 16

[ఉగ్రదత్తుణ్ణి, అతడి స్నేహితులైన రుద్రారుద్రుల్నీ తీసుకుని పులిరాయుళ్ళు, భయంకర పక్షుల మీద జ్వాలాద్వీపానికి బయలుదేరారు. వాళ్ళను ఆకాశంలో భల్లూకరాయుళ్ళు భీకరంగా ఎదుర్కొన్నారు. ఉగ్రదత్తుడున్న భయంకర పక్షి ఒక కొండ మీద దిగింది. అక్కడ కొందరు భల్లూకరాయుళ్ళు అతణ్ణి వెంటబెట్టుకుని, ఒక రహస్య బిలంగుండా బయలుదేరారు. తరవాత—]

భల్లూకరాయుళ్ళు బిల ద్వారాన్ని మూయగానే, లోపల అంతా గాఢాంధకారమయింది. ఉగ్రదత్తుడు అడుగు వేయబోయి కాలు జారటంతో ముందుకు పడబోయాడు. కాని, అంతలోనే ఒక భల్లూకరాయుడు అతడి భుజం పట్టుకుని ఆపుతూ, ''తొందరపడకు, మనం యిరవై మెట్లు దిగిగాని, బిలం అడుగు భాగాన్ని చేరలేం. ఇదుగో, మనకు దారి చూపే వెలుగు!'' అంటూ కట్టుకున్న ఎలుగు చర్మాల్లో నుంచి ధగధగ ప్రకాశిస్తున్న ఒక మణిని బయటికి తీశాడు. ఆ వెంటనే, అతడి అనుచరు లిద్దరూ కూడా తమవద్ద వున్న మణులను బయటికి తీసి, మెట్లు దిగసాగారు.

భల్లూకరాయుళ్ళ చేతుల్లో మెరిసిపోతున్న మణులను చూస్తూనే ఉగ్రదత్తుడు ఎంతో ఆశ్చర్యపడ్డాడు. చీకటిలో




దారి చూసుకునేందుకు కాగడాలూ, కొవ్వొత్తులూ లేనందున, ఈ వెల లేని మణులను వీళ్ళు కాగడాలుగా వాడుకుంటున్నారన్నమాట.

"ఈ ద్వీపంలో చమురు దొరకదా? వెలుగు కావాలంటే, ఈ మణులు తప్ప మరో సాధనం లేదా?" అని అడిగాడు ఉగ్రదత్తుడు.

"చమురా? ఏమిటదీ? ఓహోఁ, దాన్ని గురించి యిక్కడకు బానిసలుగా వచ్చిన మీ దేశంవాళ్ళు చెప్పగా విన్నాం," అన్నాడొక భల్లూకరాయుడు.

"ఇది చాలా చిత్రమైన ద్వీపం," అనుకున్నాడు ఉగ్రదత్తుడు. అంతలోనే అతడికి పులిరాయుళ్ళ చేజిక్కిన తన స్నేహితులు రుద్రారుద్రులూ, సామంత రాజు సుదర్శనుడి కుమార్తె చంద్రసేనా గుర్తుకువచ్చారు.

ఉగ్రదత్తుడు వాళ్ళను గురించి ఆలోచిస్తూనే, ఇరవై మెట్లు దిగి, బిలం అడుగు భాగాన్ని చేరాడు. బిలం ఏమంత విశాలమైనది కాదు. దాని వెడల్పు ఒక గజం కన్న ఎక్కువ వుండదు. ఎత్తు కొన్నిచోట్ల అయిదడుగులూ, మరికొన్ని చోట్ల పదడుగుల వరకూ వుంటుంది.

"ఈ బిలం ఎక్కడికి పోతుంది? ఇంతకూ మీరు నన్ను పులిరాయుళ్ళ నుంచి కాపాడింది, మరొక భల్లూక రాయుడికి బానిసగా అమ్మేందుక్కాదు గదా?" అన్నాడు ఉగ్రదత్తుడు.

భల్లూకరాయుళ్ళలో ఒకడు నవ్వాడు, మరొకడు కోపంగా గద్దించాడు. మూడవవాడు, ఉగ్రదత్తుడికేసి చూస్తూ, "నిన్ను బానిసగాచేసేందుకే తీసుకుపోతున్నవాళ్ళమయితే, నీ కీ బిల మార్గం తెలియకుండా కళ్ళకు గంతలు కట్టి వుండేవాళ్ళం. మనుషుల్ని బానిసలుగా వుపయోగించుకునేవాళ్ళం మేం కాదు. పులిరాయుళ్ళు. అయినా మీ దేశం వాళ్ళనందర్నీ నమ్మేందుకు లేదు. మీవాళ్ళే కొందరు బానిసల్ని పట్టుకొచ్చేందుకు, పులిరాయుళ్ళ నాయకు

డైన ఏకపాదుడికి సహాయం చేస్తున్నారు. నాగవర్మ అనేవాడు నీకు తెలుసా?'' అని అడిగాడు.

''తెలుసు. వాడు....'' ఉగ్రదత్తుడు మాట ముగించేలోపలే, మరొక భల్లూక రాయుడు మొదటివాణ్ణి గట్టిగా కసురుతూ, ''నువ్వు చాలా అధిక ప్రసంగి వవుతున్నావు. మన నాయకుడు చెప్పి పంపిన దేమిటి? మరిచిపోయావా?'' అన్నాడు తీవ్రంగా.

మొదట మాట్లాడిన భల్లూకరాయుడు కుక్కినపేనులా అయిపోయాడు. మణు లను అరచేతిలో పెట్టుకుని ముందు ఇద్దరు భల్లూకరాయుళ్ళూ, మధ్య ఉగ్ర దత్తుడూ, అతడికి వెనకగా మరొక భల్లూక రాయుడూ మౌనంగా బిలం వెంట నడవ సాగారు. రెండు మూడు నిమిషాల కాలం అలా నడిచేసరికి, ఎదురుగా బిలం మూసుకుపోయినట్టు, అడ్డంగా నిలువెత్తు రాయి ఒకటి కనిపించింది. ముందు నడుస్తున్న భల్లూకరాయుడు, అక్కడ ఆగి, రాతిలో కొంచెం పల్లంగా వున్నచోట చూపుడు వేలితో నొక్కాడు. రాయి కొంచెం కదిలినట్టయింది. ఆ వెంటనే దాని వెనక నుంచి, 'శరభం!' అన్న పిలుపు విన వచ్చింది. దానికి జవాబుగా ముందున్న భల్లూకరాయుడు, 'భల్లూకం!' అన్నాడు



పెద్దగా. రాయి తలుపులా కిర్రుమంటూ కొద్దిగా తెరుచుకున్నది. ఎలుగుబంటి చర్మాలు ధరించి, పెద్ద కత్తి నొకదాన్ని పట్టుకొనివున్న భటుడొకడు రాతి తలుపు పక్కనుంచి తొంగి చూశాడు.

'శరభం', 'భల్లూకం' అన్న మాటలు ఆ రాత్రికి భల్లూకరాయుళ్ళు నిర్ణయించు కున్న సంకేతాలని ఉగ్రదత్తుడు గ్రహిం చాడు. వీళ్ళు కూడా ఇరవైనాలుగ్గంటలూ శత్రుభయంతో సతమతమైపోతున్నారని అతడు ఊహించాడు.

''ఒక్కడేనా దొరికింది! తతిమ్మావాళ్ళే మయారు?'' అన్నాడు కావలి భటుడు కోపంగా.




''వాళ్ళ సంగతి మాకేమీ తెలియదు. అయినా, గబ్బిలాయిలా బిలాన్ని అంటి పెట్టుకుని వుండే నీకు ఈ వైనాలన్నీ ఎందుకు ?'' అంటూ ముందున్న భల్లూక రాయుడు, రాతి తలుపును సాంతం తెరిచి ముందుకు వెళ్ళాడు.

అతడి వెనకగా మిగిలినవాళ్ళు కూడా బయలుదేరారు.

ఉగ్రదత్తుడు, భల్లూకరాయుళ్ల వెంట బిలంలో చాలా దూరం నడిచాడు. అయినా, దానికి అంతం వున్నట్టు కనబడ లేదు. బిలంలో అనేకచోట్ల పైనుంచి వెలుగు పడుతున్నట్టూ, కొన్ని కొన్ని ప్రాంతాల్లో ఎవరో, బిలం గోడల వెనుక మాటలాడుతున్నట్టు కూడా అతడికి అను మానం కలిగింది. ఈ భల్లూకరాయుళ్ళ నాయకుడు కంధుడు పులిరాయుళ్ళ ధాటికి తట్టుకోలేక, ఇలాంటి రహస్య ప్రదేశాల్లో కాలం గడుపుతున్నాడని ఉగ్ర దత్తుడు అనుకున్నాడు.

హఠాత్తుగా ముందు నడుస్తున్న భల్లూక రాయుడు ఆగి, తన అరచేతిలో వున్న మణిని గట్టిగా గుప్పెటలో బిగించి, దాన్ని నేలబారుగా నాలుగైదుసార్లు వూపాడు. ఆ వెంటనే భూమి బద్దలవుతున్నట్టు పెద్ద ధ్వని అయింది. చూస్తూండగానే భల్లూక రాయుడి పాదాల దగ్గిర భూమి విచ్చి నట్టయి, అందులో నుంచి ఉన్నట్టుండి కళ్ళను మిరుమిట్లు కొలిపేలా వెలుగు పైకి వచ్చింది.

''ఇక్కడ ఇరవైఒక్క మెట్లున్నవి! జాగర్త, కాలు జారిందో!...'' అంటూ ఒక భల్లూకరాయుడు ఉగ్రదత్తుణ్ణి హెచ్చరించి, మెట్లు దిగసాగాడు. ఉగ్ర దత్తుడి ఆశ్చర్యానికి అంతులేదు.

బిలం మధ్యలో ఒక పెద్ద అగాధం, అందులో నుంచి పట్టపగలులా వెలుగు!

ఉగ్రదత్తుడూ, అతడి వెంట వున్న వాళ్ళూ మెట్లు దిగి, సమతలంగా వున్న ప్రదేశాన్ని చేరారు. ఆ ప్రదేశానికి చుట్టూ వున్న గోడలలో తాపడం చేసిన మణుల



నుంచి దేదీప్యమానంగా కాంతి వస్తున్నది. ఎదురుగా నిలువెత్తున ద్వారం ఒకటి వున్నది. దాని తలుపులు బంధించబడి వున్నవి. ఉగ్రదత్తుడి వెంట వచ్చిన భల్లూకరాయుళ్ళలో ఒకడు, ఆ తలుపుల దగ్గరకు వెళ్ళి, వాటి మీద గుప్పెటతో, మూడుసార్లు గట్టిగా కొట్టాడు. వెంటనే ద్వారాలు తెరుచుకున్నవి. ఎదురుగా వున్న ఒక ఉన్నతాసనం మీద శిరస్త్రాణంలో ఎలుగుబంటి చెవులు ధరించి వున్న, ఒక దృఢకాయుడు కూచుని వున్నాడు.

భల్లూకరాయుడు అతడి దగ్గిరకు వెళ్లి, మందస్వరంలో ఏదో చెప్పాడు. ఆసనం మీద కూచున్న వ్యక్తి, ఉగ్రదత్తుడి కేసి దృష్టి సారించి, తల పంకిస్తూ భల్లూకరాయుడితో ఏమో అన్నాడు. వెంటనే భల్లూకరాయుడు ఉగ్రదత్తుడున్న చోటుకు వచ్చి, "ఆయన, మా నాయకుడు కంధుడు. నిన్ను దగ్గిరకు తీసుకు రావలసిందిగా చెప్పారు," అన్నాడు.

ఉగ్రదత్తుడు నిర్భయంగా, కంధుడి ఎదుటకు వెళ్ళి నిలబడ్డాడు. కంధుడు అతణ్ణి నిశితంగా చూస్తూ, "నీతోబాటు మీ దేశాన్నుంచి పులిరాయుళ్ళచే అపహరించుకు రాబడిన వాళ్ళెందరు?" అన్నాడు.

"నలుగురం. ఒకామె స్త్రీ." అన్నాడు ఉగ్రదత్తుడు.

"వాళ్ళెక్కడున్నారో, నీకేమైనా తెలుసా?" అని అడిగాడు కంధుడు.

"తెలియదు," అంటూ ఉగ్రదత్తుడు ఆశ్చర్యపోయాడు. కంధుడు యిలాంటి ప్రశ్నలు తనను ఎందుకడుగుతున్నాడో, వీటి వెనక వున్న రహస్యం ఏమిటో అతడికి అవగాహన కాలేదు.

ఉగ్రదత్తుడు తనను గురించే ఆలోచిస్తున్నాడని గ్రహించినవాడిలా కంధుడు చిరునవ్వునవ్వి, "నేను, మీకు మిత్రుణ్ణి. మీ దేశాన్నుంచి మనుషుల్ని అపహరించుకురావటంలో నా కెలాంటి ప్రమేయం

లేదు. పులిరాయుళ్ళు మీ కెంత శత్రు వులో, నాకూ అంతే శత్రువులు. కొండ గుహల్లో, బిలాల్లో నేనూ, నా అనుచరులూ ఎంత రహస్యంగా కాలం గడపవలసి వస్తున్నదో నువ్వే చూశావుగదా? మీ దేశానికి, ఈ జ్వాలాద్వీపానికి మహమ్మారిలా దాపురించిన ఏకపాదుణ్ణీ, అతడి భటులనూ సర్వనాశనం చేయటానికే, నేనూ, మీ దేశస్థుడైన మరొక వ్యక్తి ఒక పథకం ఆలోచించాం. బహుశా ఆ వ్యక్తిని నువ్వు గుర్తించగలవేమో చూద్దాం," అంటూ తన అనుచరులలో ఒకడికి సౌంజ్ఞ చేశాడు.




కంధుడి అనుచరుడు తమ నాయకుడి ఆసనానికి వెనకగా వున్న ఒక తలుపు తెరిచాడు. ఆ వెంటనే రుద్రుడు నవ్వుతూ ఉగ్రదత్తుణ్ణి సమీపించి, "నిన్ను ప్రాణాలతో చూడగల ననుకోలేదు, ఉగ్రదత్తా!" అన్నాడు ఆప్యాయంగా.

"రుద్రుడు!" అంటూ ఉగ్రదత్తుడు పరమానంద భరితుడై, "అరుద్రుడెక్కడ? చంద్రసేన ఏమయింది?" అని ఆత్రుతగా ప్రశ్నించాడు.

"ఆ యిద్దరూ పులిరాయుళ్ళ అధీనంలోనే వున్నారు. నేను మాత్రం ఈ కంధుడి అనుచరులవల్ల రక్షించబడ్డాను," అన్నాడు రుద్రుడు నిస్పృహగా.

కంధుడు లేచి నిలబడి ఉగ్రదత్తుడితో, "నీ గురించి రుద్రుడి ద్వారా సర్వం తెలుసుకున్నాను. ఈనాటికి ఏకపాదుణ్ణీ, అతడి మూకనూ నాశనం చేసే అవకాశం కలిగింది. నేనూ నీ స్నేహితుడైన రుద్రుడూ వేసిన పథకం మరేం లేదు. నీ పెంపుడు తండ్రి అయిన ఉగ్రాక్షుణ్ణీ, అతడి సేవకులనూ ఈ ద్వీపం చేర్చి, వాళ్ళ సహాయంతో ఏకపాదుడి కోటను ముట్టడించటం," అన్నాడు.

"మీ స్వాధీనంలో వున్న భయంకర పక్షులు మహాకాయులైన రాక్షసులను మోయగలవా?" అని అడిగాడు ఉగ్రదత్తుడు అనుమానంగా.

''అంత పెద్ద మహాకాయుల్ని మోసే శక్తి వాటికి లేదు. నీ బంధు గణమంతా పడవల్లో బయలుదేరి ఇక్కడికి రావల సిందే,'' అన్నాడు కంధుడు.

''నేను బందీగా వచ్చేప్పుడు, ఈ ద్వీపాన్నీ, దీని చుట్టూ సముద్రం అంచుల వరకూ వున్న అగ్ని పర్వతాలనూ చూశాను. అగ్ని పర్వతాల నుంచి వెలువడిన లావా ద్రవం సముద్ర తీరాన్నంతా మంటల మయం చేస్తున్నట్టు నాకు కనబడింది. అలాంటి స్థితిలో పడవలు తీరాన్నెలా చేరగలవు ?" అని అడిగాడు ఉగ్రదత్తుడు.

ఈ ప్రశ్న వింటూనే కంధుడు నవ్వి, తన అనుచరులకేసి సగర్వంగా చూస్తూ, ''సముద్ర తీరంలో మంటల పాలు కాకుండా, పడవలను ఒడ్డుచేర్చే కొన్ని ప్రదేశాలు నా అనుచరులకు తెలును. అసలు ప్రమాదం ఏకపాదుడి కోటను ముట్టడించటంలో వున్నది. అ తరవాత వాడు దొరికినా వాణ్ణి చంపటంలో మరింత పెద్ద ప్రమాదం వున్నది!'' అన్నాడు.

కంధుడి మాటలు ఉగ్రదత్తుడికి సంభ్రమాశ్చర్యాలు కలిగించినై. అది గ్రహించిన కంధుడు అతణ్ణి తన వెంట పెట్టుకుని, ఒక రహస్య మార్గం గుండా బిలంలో నుంచి కొండ పైభాగానికి తీసుకుపోయి, ''అదుగో, ఆ మంటల మధ్య వున్నట్టు కనబడేదే ఏకపాదుడి కోట. ఇక్కణ్ణించి చూసినప్పుడు అది మంటల మధ్య వున్నట్టు కనబడినా, నిజానికి దాని చుట్టూ అగ్ని పర్వతాలు లేవు. దాన్ని చేరేందుకు సురక్షితమైన ఒక మార్గం వున్నది. కాని, కోట మనం ఆక్రమించుకున్నా ఏకపాదుణ్ణి చంపటమే పెద్ద సమస్య!'' అన్నాడు.

''మన చేతిలో వాడు చిక్కటమంటూ జరిగితే, వాణ్ణి చంపటం ఎంతసేపు!'' అన్నాడు ఉగ్రదత్తుడు.

''వాడికి తిరుగులేని ఒక అద్భుత శక్తి వున్నది. అదేమిటంటే: వాడెవరి నెత్తురు చూసినా, లేక వాడి నెత్తురు ఎవరు చూసినా—తప్పక మరణిస్తారు!" అన్నాడు కంధుడు. —(ఇంకావుంది)






# సేవకుడి సలహాలు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, అర్ధరాత్రివేళ నక్కలూ, భూతప్రేతాలూ సంచరించే యీ శ్మశానంలో, నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే, జాలి కలుగుతున్నది. మేధావులైన మనుషుల ప్రవర్తన, ఒకొక్కక్కసారి విచిత్రంగా వుంటుంది. నువ్వూ అలాంటి వాళ్ళల్లో ఒకడివేమో అన్న శంక కలుగుతున్నది. ఈ మేధావులు ప్రపంచం ఒక పద్మవ్యూహం, అనుకుంటారు. అయినా, యితరులకు ఏవైనా సమస్యలు ఎదురైనప్పుడు మౌనంగానే, మూగవాళ్ళుగానో వుండిపోలేరు. ఆ కారణంగా, వాళ్లు చిక్కులపాలవుతూంటారు. ఇందుకు ఉదాహరణగా, మేధావి అయిన

## బేతాళ కథలు



ఒక సేవకుడు, రాజాశ్రయాన్ని కోల్పోయిన కథ చెబుతాను. శ్రమ తెలియకుండా, విను,'' అంటూ యిలా చెప్పసాగాడు:

చంద్రశిలా రాజ్యపాలకుడైన చరిత్రార్థుడి కొలువులో, సుచరితుడనే సేవకుడుండేవాడు. వాడు చురుకైనవాడు; ఏ సమస్యనైనా, అన్ని కోణాల నుంచీ చూడగల మేధావి. అయితే, వాడి ప్రతిభను రాజు చరిత్రార్థుడు గమనించలేదు. సుచరితుడు కూడా తన తెలివితేటలను, రాజు దగ్గిర ఏనాడూ ప్రదర్శించే ప్రయత్నం చేయలేదు.

ఒకనాడు చరిత్రార్థుడు, ఏదో విషయం గురించి తీవ్రంగా ఆలోచిస్తూండగా, సుచరితుడు, ఆయనకు ద్రాక్షపానీయం యిచ్చేందుకు వెళ్ళాడు. రాజు, ఏదో సమస్య గురించిన దీర్ఘాలోచనలో వున్నాడని గ్రహించిన సుచరితుడు, ఆయనను, ''మహారాజా, తీవ్రాలోచనలో వున్నట్టున్నారు. అదేమిటో తెలుసుకోవచ్చునా?'' అని అడిగాడు.

ఇందుకు రాజు నవ్వి, ''మహారాజునైన నాకే, ఆ సమస్యను ఎలా పరిష్కరించాలో తెలియడం లేదు; నీవల్ల నేమవుతుంది? అయినా, చెపుతాను విను. మన రాజ్యంలో, నిశితుడనే గజదొంగ ఆగడాలు మితిమీరి పోతున్నవి. వాడెందరినో దోచుకుంటున్నాడు. వాణ్ణి బంధించేందుకు చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. ప్రజలు తమ ఆస్తులకు రక్షణ కల్పించలేకపోతున్నానని, నన్ను నిందిస్తున్నారు. నువ్వే రాజువైతే, ఈ కఠినమైన సమస్యను ఎలా పరిష్కరించేవాడివి?'' అని ప్రశ్నించాడు.

సుచరితుడు ఒక్క క్షణం ఆలోచించి, ''మహారాజా, నేనే రాజునైతే, యీ సమస్యను యిలా పరిష్కరించేవాడిని! మన నగరానికి దాపులనున్న మైదానంలో, కొంతమంది కూలీలచేత, తవ్వకపు పనులు ప్రారంభించేవాడిని. అక్కడి నేల కింద, ఒక పురాతన శివాలయపు శిథిలాలున్నా

యనీ, అందులో స్వర్ణ నందివిగ్రహం వున్నదనీ, ప్రజలలో ప్రచారం చేయించేవాడిని. ఇది నిశితుడి చెవిని పడకపోదు. ఈ స్వర్ణ నందివిగ్రహం సంగతి తెలుసుకోవాలని, వాడు కూలీగా అక్కడికి వచ్చి తీరుతాడు. నిజానికి తవ్వకాలు జరిపేది, కూలీల వేషంలో వున్న, మన సైనికులే! వాళ్ళచేత, కొత్త ముఖాలు కన్పించగానే, పట్టి బంధించే ఏర్పాటు చేసేవాడిని. దీనితో నిశితుడు తేలికగా దొరికిపోతాడు,'' అని చెప్పాడు.

ఇది విన్న రాజు చరితార్థుడు. సుచరితుడి ఆలోచనాపటిమకు ఎంతగానో ఆశ్చర్యపోయి, వాడు చాలా తెలివైనవాడని గ్రహించాడు. ఆయన, వాడి సలహా ప్రకారం చేసి, నిశితుణ్ణి పట్టుకుని కారాగారంలో వేయించాడు.

కొంతకాలం గడిచాక, రాజుకు మరొక సమస్య ఎదురైంది. పొరుగు రాజు సింహభూపతి, చరితార్థుడి మీద యుద్ధం ప్రకటించాడు. చంద్రశిలా రాజ్యం సైనికంగా, పొరుగు రాజ్యం కన్న బలహీనమైనది; యుద్ధం జరిగితే, ఓటమి తప్పదు.

ఈ సమస్యను, ఎలా పరిష్కరించటమా అని రాజు ఆలోచిస్తూండగా, ఆయన దృష్టి, ఉద్యానంలో మొక్కలకు నీళ్ళు పోస్తున్న సుచరితుడి మీద పడింది.

ఆయన, వాణ్ణి పిలిచి, సంగతి చెప్పి, ''నీవే రాజువైతే, ఈ సమస్యను ఎలా పరిష్కరించేవాడివి?'' అని అడిగాడు.





చెల్లాచెదరై పారిపోయే సమయంలో, వాళ్ళ మీద, మన సైనికులు బాణ ప్రయోగం చేయాలి. ఒకవేళ కొందరు సైనికులు మొండిగా ముందుకు వస్తే, వాళ్ళను లోయముఖద్వారంలో వున్న మన అశ్వికులు తుదముట్టిస్తారు,'' అన్నాడు.

రాజు, సుచరితుడు చెప్పినట్టే చేసి, శత్రుసైన్యాలను చెల్లాచెదరు చేసి పారదోలాడు.

దీనితో సుచరితుడి మేధాశక్తి మీద, చరితార్థుడికి మంచి నమ్మకం ఏర్పడింది. ఆయన, వాడితో, ''నిన్ను, నా ప్రధాన సలహాదారుగా నియమించాలని, ఆలోచిస్తున్నాను. ఏమంటావు?'' అన్నాడు.

అందుకు సుచరితుడు, ''మహారాజా, పదవి బాధ్యతను పెంచుతుంది. బాధ్యత ఆలోచనను కుంటుపరుస్తుంది. నేనప్పుడు, యింత స్వేచ్ఛగా ఆలోచించలేను. అంతే కాక, నా సలహాలతో, మీరు రాజ్యపాలన చేస్తున్నారని తెలిస్తే, ప్రజలు మిమ్మలను తక్కువగా అంచనా వేస్తారు. అందువల్ల, నన్ను యిలాగే వుండనివ్వండి,'' అన్నాడు వినయంగా.

రాజుకు, సుచరితుడు చెప్పింది, సమంజసంగానే తోచింది.

మరి కొంతకాలం తర్వాత, విధ్వంసకుడనే రాక్షసుడు, చంద్రశిలా రాజ్యం సమీ

అందుకు సుచరితుడు, ''మహారాజా, ఆ సింహభూపతి, హఠాత్తుగా మన మీద దాడి చేయకుండా, అహం కొద్దీ ముందుగా యుద్ధ ప్రకటన చేయడం మేలే అయింది. అతడు పెద్ద సైన్యంతో, మన సరిహద్దులు దాటాలంటే, సన్నని లోయమార్గం ఒక్కటే శరణ్యం. మీరు, మన సైనికులను, లోయ పైన యిరుపక్కలా సమాయత్తం చేయండి. మన వైపు లోయ ముఖద్వారం దగ్గిర, అశ్వసైనికులను కాపలా వుంచండి. శత్రుసైనికులు లోయ ప్రవేశించాక, మన సైనికులు పైనుంచి, వాళ్ళ మీదికి బండరాళ్ళు దొర్లిస్తారు. వాటి దెబ్బకు చావగా మిగిలిన శత్రువులు,

పంలో వున్న అరణ్యంలో ప్రవేశించి, అటుగా పోయే ప్రయాణీకులను చంపి తినసాగాడు. రాజు చరితార్థుడు వేగులను పంపి విచారించగా, రాక్షసుడు మహా శక్తి వంతుడని తెలియవచ్చింది.

ఆయన, సుచరితుణ్ణి పిలిపించి, సమస్య వివరించి, ''నీవే రాజువైతే, ఏం చేసేవాడివి?'' అని ప్రశ్నించాడు.

అందుకు సుచరితుడు, ''విధ్వంసకుణ్ణి, మనం యుక్తితో జయించాలి! నేనే రాజునైతే, యిలా చేసివుండేవాణ్ణి.'' అని తన పథకం వివరించాడు.

అది రాజుకు నచ్చింది. ఆయన, అ రోజే రథంమీద, విధ్వంసకుడున్న అరణ్య ప్రాంతానికి వెళ్ళాడు.

రాజును చూసిన విధ్వంసకుడు, పెద్దగా బొబ్బరించి, ''ఎంతధైర్యం! నా ఎదుటికే రావడమా? ఎవరువు నువ్వు?'' అని అడిగాడు.

''విధ్వంసకా! నేనీ రాజ్యాన్ని పాలించే రాజును. నువ్వు అరణ్యంలో దొరికిన వారిని దొరికినట్టు తింటుంటే, ప్రజలు ప్రాణభయంతో నన్ను నిందిస్తున్నారు. ఇకనుంచి నేనే, రోజుకు నలుగురు దృఢకాయుల్ని, నీదగ్గిరకు పంపిస్తూంటాను. దారేపోయే వారి జోలికి మాత్రం పోకు,'' అన్నాడు రాజు చరితార్థుడు.

విధ్వంసకుడు, ఈ ఏర్పాటుకు ఒప్పుకున్నాడు. అప్పుడు రాజు, వాణ్ణి, ''నీనుంచి, నాకొక్క చిన్న సాయం





కావాలి. ఈ దాపులనే, ఒక పెద్ద లోతైన సరస్సు వున్నది. కొంతకాలం క్రితం, దొంగలు మా అంతఃపురం ప్రవేశించి, మా ఆరాధ్య దేవత స్వర్ణ విగ్రహాన్ని దొంగిలించారు. భటులు వెంటబడగా, వాళ్ళు విగ్రహాన్ని సరస్సులోకి విసిరి వేశారు. దొంగలైతే దొరికారుగాని, విగ్రహం సరస్సులోనే వుండిపోయింది. ఎవరూ, అందులో దిగ సాహసించడంలేదు. నువ్వా విగ్రహాన్ని వెదికి బయటకు తీయాలి,'' అని కోరాడు.

విధ్వంసకుడు జబ్బలు చరిచి, ''అదెంతపని! సరస్సుకు దారితియ్యి,'' అన్నాడు.

ఇద్దరూ సరస్సు వద్దకు వెళ్ళారు. ఆ సరస్సంతా భయంకరమైన ఊబిమయం. ఆ సంగతి తెలియని విధ్వంసకుడు, అమితగర్వంతో సరస్సులోకి దూకి, అందులో వున్న ఊబిలో చిక్కుకుని, ఎంత ప్రయత్నించీ బయటికి రాలేక, మునిగిపోయాడు.

రాజు తిరిగివచ్చి, చరితార్థుణ్ణి ప్రశంసించి, ''నీమేధాశక్తి అమోఘం! నిన్ను ఘనంగా సన్మానించాలనుకుంటున్నాను,'' అన్నాడు.

ఇందుకు సుచరితుడు ఒప్పుకోక, ''మహారాజా, అభినందన సభలూ, సన్మానాలూ అహంకారాన్ని పెంచుతాయి. అప్పుడు, నేనింత సరళంగా ఆలోచించలేను. నన్నిలాగే వుండనివ్వండి,'' అన్నాడు.

ఇది జరిగిన కొన్నాళ్ళకు, చారుల ద్వారా రాజు, రాజోద్యోగులలో లంచగొండితనం విపరీతంగా పెరిగిపోతున్నదని తెలుసుకున్నాడు.

అయన, సుచరితుడితో, ''రాజోద్యోగులలో లంచగొండితనం ఎక్కువై పోయింది. నీవే రాజువైతే, ఏం చేసేవాడివి?'' అన్నాడు.

సుచరితుడు కొద్దిసేపు మౌనంగా వూరుకుని, ''మహారాజా, నేను రాజు

కావడం అన్నది కలలో మాట. రాజరికం అన్నది, వంశపారంపర్యంగా గాని, లేక ఖడ్గబలంతోగాని మాత్రమే సాధించవచ్చు. కాని, దాన్ని నిలుపుకునేందుకు, సొంత ఆలోచనాశక్తి అవసరం అవుతుంది. నేను రాజభక్తిగల సామాన్య పౌరుణ్ణి," అన్నాడు.

చరితార్థుడు, ఆ జవాబు విని, ఒకటి, రెండు క్షణాలు ఆలోచిస్తూ వూరుకుని, తల పంకించి, తర్వాత కోపంగా, "సుచరితా, నిన్ని క్షణమే ఉద్యోగం నుంచి తొలగిస్తున్నాను. మరెక్కడికైనా పోయి బతుకు!" అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఆనాటివరకూ రాజుకు ఎదురైన ఎన్నో గడ్డు సమస్యలకు, మంచి సలహాలిచ్చి తోడ్పడిన సుచరితుడు, రాజోద్యోగుల లంచగొండితనం విషయమై, ఎందుకు సలహా యివ్వ నిరాకరించాడు? ఎంతో కాలంగా, తన మేధాశక్తితో సమస్యల పరిష్కారానికి సాయపడిన సేవకుణ్ణి, అంత నిర్దయగా రాజు ఎందుకు పనిలో నుంచి తొలగించాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీతల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు, సేవకుడి ప్రవర్తనలో, అంతగా సందేహపడవలసిన గూఢ రహస్యం ఏమీలేదు. సుచరితుడు, తానక్కడ వున్నంతకాలం, రాజు స్వయంగా ఆలోచించలేడని గ్రహించాడు. అందుకే, రాజుకు కోపం వస్తుందని తెలిసీ, సలహా యివ్వ నిరాకరించాడు. ఇది అర్థం చేసుకున్న చరితార్థుడు, సుచరితుణ్ణి ఉద్యోగంనుంచి తొలగించాడు. ఇందులో, రాజు నిర్దయగా ప్రవర్తించాడన్న ప్రశ్న తలఎత్తదు. అంత మేధావి అయిన సుచరితుడు, ఎక్కడ అయినా సుఖంగా బతకగలడని, ఆయనకు తెలుసు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# మారు తాళంచెవి

శివపురంలో వుండే శేషన్న అనే అతను, తాళాలు బాగుచేయడంలోనూ, మారు తాళం చెవులు తయారు చెయ్యడంలోనూ సిద్ధహస్తుడు.

ఒకనాడు రామయ్య అనే రైతు, శేషన్న దగ్గిరకు ఒక తాళంచెవి పట్టుకొచ్చి, "శేషన్నా, యిలాటిదే మరొక తాళంచెవి చేసిపెట్టు," అన్నాడు.

రామయ్యను, కొత్తతాళం చెవికోసం, మర్నాడు రమ్మన్నాడు శేషన్న.

రామయ్య మర్నాడు శేషన్న దుకాణానికి వెళ్ళాడు. శేషన్న అతడికి రెండు తాళం చెవులు యిచ్చాడు.

రామయ్య, శేషన్న తయారుచేసిన తాళంచెవి కేసి పరీక్షగా చూస్తూ, "ఇది బాగా పని చేస్తుందంటావా?" అని అడిగాడు.

దానికి శేషన్న గర్వంగా, "నా పనితనం గురించి, మీకు తెలిసేవుంటుంది! నేను తయారు చేసిన తాళంచెవి పనిచేయకపోవడమంటూ, యింతవరకు జరగలేదు," అన్నాడు.

అది విని రామయ్య, "అందుకేగదయ్యా, నీదగ్గిరకొచ్చింది. వెధవది, యీ తాళంచెవి పని చెయ్యడంలేదు. అందువల్లే యింకో తాళంచెవి చేయించాల్సి వచ్చింది!" అన్నాడు, తాను శేషన్నకిచ్చిన తాళంచెవి చూపిస్తూ.

—సి. ఎస్. ఎ. పరీఫ్



మనదేశపు అద్భుతాలు:

# ఫతేపూర్ సిక్రీ

ఆగ్రా నగరానికి నలభై కి. మీ. నైరుతి దిశగా, కొండమీద ఒక అద్భుతమైన కోట వెలుగొందుతున్నది. అక్బర్ చక్రవర్తి నిర్మించిన ఈ కోట, అచిర కాలంలోనే వదిలిపెట్టబడి నిర్మానుష్యమయింది!





అక్బర్ ఎన్నో ప్రాంతాలను జయించి సువిశాలమైన రాజ్యం స్థాపించాడు. అయినా ఆయనకు చాలా కాలం సంతాన ప్రాప్తి లేకపోవడంతో విచార గ్రస్తుడయ్యాడు. ఆ సమయంలో, ఆయన కొండమీద నివసిస్తున్న షేక్ సలీం చిస్తీ అనే ఒకఫకీరు మహిమలను విని, ఆయన్ను దర్శించి ఆశీస్సులు పొందాడు.

కొన్నాళ్ళకు, అక్బర్ హైందవ సతీమణి ఒక చక్కటి కొడుకును కన్నది. ఫకీరు మీది భక్తి కారణంగా అక్బర్ తన బిడ్డకు సలీం అని నామకరణం చేశాడు. అతడే ఆ తరవాత జహంగీరుగా పేరు గాంచాడు.






ఫకీరుకు సాధ్యమైనంత సమీపంలో నివసించాలని, అక్బర్ తన రాజధానిని ఆగ్రానుంచి సిక్రీ కొండమీదకు మార్చడానికి సంకల్పించాడు. కోట నిర్మాణం చకచకా ప్రారంభమయింది.

సిక్రీనుంచి అక్బర్ 1573వ సంవత్సరం గుజరాత్ మీదికి దండయాత్ర జరిపాడు. మొదట ఎన్నో అవరోధాలు ఎదురయినప్పటికీ, చివరికి అక్బర్ విజయం సాధించి, తన రాజధానికి చేరుకున్నాడు. తన విజయానికి చిహ్నంగా అక్బర్ సిక్రీకి, ఫతేపూర్ (విజయనగరం) అన్న మాటను కలిపాడు.





అక్బర్ ఈ కోటలో పదిహేను సంవత్సరాలు గడిపాడు. ఆయన, తన మంత్రీ, మిత్రుడూ అయిన బీర్‌బల్‌తో కలిసి ఇక్కడ కొంతకాలం హాయిగా గడిపాడు. సుప్రసిద్ధ గాయకుడు తాన్‌సేన్ సైతం, ఈ అందమైన కోట, సుందర పరిసరాల పట్ల ఎంతో ఆకర్షితుడయ్యాడు.

కాని, ఈ సంతోషం అట్టేకాలం కొనసాగలేదు. ఫతేపూర్ సిక్రీలో నీటి ఎద్దడి ఏర్పడింది. అక్కడి ప్రజల దాహం తీర్చడానికి గుక్కెడు నీళ్ళు లేకుండా పోయాయి. ఎంత ప్రయత్నించినప్పటికి నీటి కరువు తగ్గలేదు. అందువల్ల కోటను వదిలిపెట్టవలసిన నిర్బంధం ఏర్పడింది.





నేలమట్టం నుంచి 176 అడుగులఎత్తూ, వేదికనుంచి 134 అడుగుల ఎత్తూగల, భారతదేశంలోనే ఎత్తయిన సింహద్వారమైన బులాండ్ దర్వాజా ఇక్కడే ఉన్నది. చలువరాతితోనూ, నున్నపు రాళ్ళతోనూ నిర్మించబడిన బ్రహ్మాండమైన ఈ సింహద్వారం చూపరులను ఎంతగానో ఆకర్షిస్తున్నది.

ఇక్కడి మరొక ముఖ్యమైన భవనం హవామహల్. ఈ కోట వైభవోపేతంగా వెలసిన రోజులలో అంతఃపుర స్త్రీలు నివసించిన ఈ భవనం, అల్లనల్లన గాలి వీచడానికి అనువుగా ఐదంతస్థులు కలిగి ఉన్నది.






చక్రవర్తి ఈ కోటను వదిలిపెట్టాక, కేవలం ఇక్కడి శిల్పసంపద కోసమే దీనిని పరిరక్షించడం అన్నది అంత సులభంకాదు. క్రమక్రమంగా దీని వైభవం క్షీణించసాగింది; కోట శిథిలం కాసాగింది. అయితే, ఈనాడు ఫతేపూర్ సిక్రీ మళ్ళీ ప్రాముఖ్యతను సంతరించుకుంటున్నది!



# తెల్లకుందేలు

జపాను దేశానికి కొంత దూరంలో కుందేళ్ల దీవి ఉండేది. అక్కడ అన్ని రంగుల కుందేళ్ళూ అసంఖ్యాకంగా ఉండేవి. కాని స్వచ్ఛమైన తెల్లకుందేలు ఒకే ఒకటి ఉండేది. ఆ తెల్లకుందేలు రోజూ సముద్రం ఉత్తర తీరపు ఇసుకలో పడుకుని జపాను తీరం కేసి తదేక ధ్యానంగా చూస్తూ ఉండేది. ఆ కుందేలుకు అక్కడికి వెళ్ళి, అక్కడి వింతలన్నీ చూడాలని గాఢమైన కోరిక ఉండేది.

తెల్లకుందేలుకు ఈ కోరిక కలగటానికి కారణం ఒక మొసలి. అది అప్పుడప్పుడూ జపాను తీరం నుంచి కుందేళ్ళ దీవికి వచ్చి అక్కడి ఇసుకలో విహరించేది. తెల్లకుందేలుకూ దానికీ మంచి స్నేహమయింది. జపాను తీరాన మురికి ఇసుక ఉంటుందనీ, అక్కడ మనుషులనే ప్రాణులుంటారనీ, వాళ్ళు నిటారుగా నిలబడి కింది కాళ్ళతో నడుస్తారనీ, పై కాళ్ళతో పనులు చేస్తారనీ, వాళ్ళకో చక్రవర్తి ఉంటాడనీ, ఆయన కొక కూతురున్నదనీ, ఆమె జుట్టు అమావాస్య చీకటి లాగానూ, ఆమె శరీరచ్ఛాయ పౌర్ణమి వెన్నెల లాగానూ ఉంటుందనీ ఏవేవో కబుర్లు చెప్పేది. మొసలి చెప్పే కబుర్లు వింటున్న కొద్దీ కుందేలుకు, సముద్రం దాటి అక్కడికి వెళ్ళి ఆ వింతలన్నీ స్వయంగా చూడాలన్న కోరిక మరింత తీవ్రమయేది.

ఒకసారి మొసలి, తెల్లకుందేలుతో, చక్రవర్తి కూతురుని పెళ్ళాడతామని ఎందరో గొప్ప గొప్ప యువకులు వస్తున్నారనీ, ఆమె వారి నెవరినీ పెళ్ళాడటానికి ఒప్పుకోలేదనీ చెప్పింది. ఇంకొక రోజు మొసలి సరికొత్త వార్త తెచ్చింది: దూర ప్రాంతం నుంచి అయిదుగురు రాజకుమా

జపాను జానపద కథ



రులు చక్రవర్తికూతుర్ని పెళ్ళాడ గోరి వస్తున్నారట; వారిలో ఎవరినో ఒకరిని చక్రవర్తి కూతురు పెళ్ళాడవచ్చునని పుకారుగా ఉన్నదట.

తెల్లకుందేలుకు జపాను వెళ్ళాలన్న కోరికా, ఆ చక్రవర్తి కూతుర్ని ఒక్కసారి చూడాలన్న కోరికా ప్రబలమయింది. అది తన స్నేహితుడైన మొసలితో, "అన్నా, నన్ను నీ వీపు మీద ఎక్కించుకుని సముద్రం దాటించావంటే నీకు యావజ్జీవం రుణపడి ఉంటాను," అన్నది.

"నే నా పని చేశానంటే మీ బంధువులంతా నాతో విరోధం కడతారు. నేను మీ తీరానికి వచ్చి మెత్తని, తెల్లని ఈ ఇసుకలో పడుకోవటానికి ఉండదు," అని మొదట మొసలి అభ్యంతరం చెప్పింది. కాని, తెల్లకుందేలు ఆవేదన చూడలేక చివరకు సరేనని, దాన్ని తన వీపు పైన ఎక్కించుకుని జపాను తీరానికి చేర్చింది. ఆ తీరం నిండా గులకరాళ్లూ, నల్లని మట్టీ ఉన్నాయి.

తెల్లకుందేలు తీరం నుంచి కొంత దూరం వచ్చేసరికి ఒక కుక్క దాని వెంటపడి పీకింది. ఎన్నడూ ఎరగని ప్రాణ భయం తెల్లకుందేలుకు పట్టుకున్నది. కుక్క చేసిన గాయాలతో బాధపడుతూ, అది ఉప్పుటేరు దగ్గిరికి వచ్చింది. ఏటి మీదుగా ఒక వంతెన ఉన్నది. వంతెన కింద దట్టంగా తుంగ ఉన్నచోట తెల్లకుందేలు దాక్కుని, తాను తన స్వదేశాన్ని విడిచి వచ్చినందుకు పశ్చాత్తాప పడసాగింది.

కొంతసేపటికి వంతెన మీద గుర్రాల డెక్కల చప్పుడయింది. కుందేలు వంతెన కింది నుంచి ఇవతలికి వచ్చి, మొట్టమొదటిసారి మనుషులను చూసింది. నలుగురు మనుషులు గుర్రాలెక్కి వస్తున్నారు. "చక్రవర్తి కుమార్తె ఇంటికి దగ్గిర దారి ఏదో?" అని వాళ్ళు తమలో తాము అనుకోవటం కుందేలు విన్నది. అన్నదమ్ములైన అయిదుగురు రాజ

కుమారులు చక్రవర్తి కూతుర్ని పెళ్ళాడ గోరి వస్తున్నారని మొసలి చెప్పింది. వారిలో నలుగురు వీళ్ళయి ఉంటారని కుందేలు ఊహించి, తనను కూడా వాళ్ళ వెంట తీసుకుపొమ్మని బతిమాలింది.

''నీ గాయాలూ, నువూనూ! నిన్ను తీసుకుపోతే చక్రవర్తి కూతురు ఎంతైనా సంతోషిస్తుంది!'' అని రాజకుమారులు తెల్లకుందేలును అవహేళన చేశారు. వారిలో ఒకడు తెల్లకుందేలును నీటిలో స్నానం చేసి, ఇసుకలో పొర్లమనీ, అలా చేస్తే గాయాలు మానుతాయనీ అన్నాడు.



నిజమే ననుకుని కుందేలు ఉప్పునీటి రులో స్నానం చేసింది. ఉప్పునీరు తగల గానే దాని గాయాలు భగ్గున మంట పెట్టాయి. మంట తగ్గుతుందనే ఆశతో అది మురికి ఇసుకలో పొర్లింది. బాధ మరింత ఎక్కువ కావటమే కాక, తెల్లని పాలనురుగు లాటి దాని ఒళ్ళంతా మలినమైపోయి, అసహ్యంగా తయా రయింది.

''ఛీ, పాడు మనుషులు! వీళ్ళకన్న కుక్కలే నయం," అనుకున్నది కుందేలు. అది వంతెన దగ్గిరికి వచ్చి, కంటికీ మంటికీ ఏకధారగా ఏడవసాగింది.

ఇంతలో వంతెన మీదుగా మరొక మనిషి వచ్చాడు. నాలుగు పెద్ద పరుపు చుట్టలు వీపున మోసుకుని, వంగినడుస్తూ వచ్చే ఈ మనిషి ఏడుస్తున్న కుందేలును చూసి, తన వీపు మీది బరువు దించి, కుందేలును ఆప్యాయంగా తన చేతుల్లోకి తీసుకుని, ''అయ్యో, పాపం! ఇలా మట్టి కొట్టుకుని ఏడుస్తున్నా వేమిటి?'' అని అడిగాడు.

ఈ మనిషి మంచివాడని కుందేలు వెంటనే గ్రహించి, తన కథ అంతా చెబుతూ, గుర్రాల మీద అటుగా వెళ్ళిన నలుగురు దుర్మార్గులూ చేసిన పని కూడా చెప్పింది. వాళ్ళు తన అన్నలేననీ, తాను అయిదో రాజకుమారుణ్ణనీ అతను చెప్పాడు. వాళ్ళు నలుగురే చక్రవర్తి

కూతుర్ని పెళ్ళాడగోరి వచ్చారుట. ఇతను వాళ్ళ నౌకరుగా వచ్చాడుట.

"నువు మాత్రం చక్రవర్తి కూతుర్ని ఎందుకు పెళ్ళాడరాదు? ఆమె చాలా అందగత్తె అని నా స్నేహితుడు చెప్పగా విన్నాను," అన్నది కుందేలు.

అతను కుందేలును మంచినీటితో కడిగాడు. వెంటనే దాని బాధ ఉపశమించింది. తరవాత దాని గాయాల మీద తుంగ పుప్పొడి చల్లి అతను, "తెల్ల కుందేలూ, నువ్విక్కడే పడుకుని కునుకు తియ్యి. నేను పరుపుచుట్టలు మా అన్నలకు చేర్చి, నిన్ను చక్రవర్తి కూతురు దగ్గిరికి తీసుకుపోతాను," అన్నాడు.

అతను తన అన్నల పరుపుచుట్టలు చేరవేసి తిరిగి వచ్చేసరికి తెల్లకుందేలు వంతెనవద్ద ఇంకా నిద్రపోతూనే ఉన్నది. అప్పటికి దాని గాయాల మీద రోమం పెరిగిపోయింది. అయిదో రాజకుమారుడు కుందేలును ఎత్తుకుని చక్రవర్తి కుమార్తె అంతఃపురానికి చేరేసరికి, అతని అన్నలను చక్రవర్తి కుమార్తె నిరాకరించటం కూడా అయిందని తెలిసింది.

ద్వారపాలకులు వెళ్ళి చక్రవర్తి కూతురితో, మరొక రాజకుమారుడు ఆమెను పెళ్ళాడగోరి వచ్చాడనీ, అతని వెంట ఒక తెల్లకుందేలు ఉన్నదనీ చెప్పారు.

"తెల్లకుందేలా? అలాటిది ఉంటుందని ఎన్నడూ వినను కూడా లేదే. అతణ్ణి లోపలికి పంపండి," అన్నది రాజకుమార్తె.

ఆమె తెల్లకుందేలును ఎత్తుకుని, దాని ఒళ్ళంతా దువ్వి, "ఎంత అందంగా ఉంది," అని ముచ్చటపడింది. తెల్ల కుందేలు ఆమెకు ఆ రాజకుమారుడు తనకు చేసిన మేలు గురించి చెప్పి, అతన్ని పెళ్ళాడమని సలహా ఇచ్చింది. చక్రవర్తి కూతురు ఒప్పుకున్నది. ఆమెకూ, అయిదో రాజకుమారుడికీ వైభవంగా పెళ్ళి అయింది.

తెల్లకుందేలు తన దేశానికి తిరిగి పోలేదు. దాని జీవితమంతా చక్రవర్తి కుమార్తె వద్దనే గడిచిపోయింది.






రాముడు చేసిన అద్భుతమైన యజ్ఞానికి వాల్మీకి తన శిష్యులతో కూడా వచ్చి, ఋషివాటికలో తన కోసం ప్రత్యేకించిన పర్ణశాలలో బస చేశాడు. తాను రచించిన రామాయణాన్ని ఎక్కడపడితే అక్కడ గానం చెయ్యటానికి తన శిష్యులకు ఆయన అనుమతి ఇచ్చాడు. ఆయన కుశలవులతో, ''మీరెవరి బిడ్డలని ఎవరన్నా అడిగితే వాల్మీకి శిష్యులమని చెప్పండి. తప్పిస్తే పుచ్చుకోకండి. రాముడు పిలిస్తే ఆయన ఎదట కూడా రామాయణాన్ని గానం చెయ్యండి. రాజు గనక ఆయన పట్ల మర్యాద చూపండి,'' అన్నాడు.

''అలాగే తాతా,'' అని వాళ్ళు పర్ణశాల నుంచి బయలుదేరారు.

వాళ్ళు రాగ తాళ యుక్తంగా రామాయణాన్ని అద్భుతంగా గానం చేస్తున్న సంగతి విని రాముడు వారిని పెద్ద సదస్సు మధ్యకు పిలిపించి, గానం చెయ్యమన్నాడు.

ఆ మహాసదస్సులో మునులూ, రాజులూ, పండితులూ, పౌరాణికులూ, సంగీతవేత్తలూ, కళాకారులూ, నాట్యం తెలిసినవారూ, ఇంకెందరో మహానుభావులు ఉన్నారు.

ఆ రోజు కుశలవులు రామాయణం నుంచి మొదటి ఇరవై సర్గలూ పాడారు. రాముడు లక్ష్మణుడితో, ''ఈ కుర్రవాళ్లకు పద్దెనిమిది వేల సువర్ణాలిప్పించు,'' అన్నాడు. కాని లక్ష్మణుడు వారికి వేరు వేరుగా బంగారం ఇవ్వబోతే వాళ్ళు,

13. కుశలవుల పట్టాభిషేకం



చొప్పున చాలా రోజులపాటు రామాయణాన్ని గానం చేశారు. ఈ గానంతో ఆ పిల్లలు సీత కొడుకులే నన్నది అందరికీ స్పష్టమయింది.

"ఈ బంగారం మా కెందుకు? మేము అరణ్యంలో కందమూల ఫలాలు తిని జీవించేవాళ్ళం," అన్నారు.

రాము డా మాటలు విని ఆశ్చర్యపడి, "అబ్బాయిలూ, మీరు పాడే ఈ కావ్యం ఎంత ఉంటుంది? దాన్ని ఎవరు రాశారు?" అని అడిగాడు.

"దీన్ని వాల్మీకి మహాముని రాశారు. ఆయన కూడా ఈ యజ్ఞానికి వచ్చి ఉన్నారు. మీకు వినాలని ఉంటే రోజూ గానం చేస్తాం," అన్నారు సీత కొడుకులు వినయంగా.

రాముడు సరే నన్నాడు. పిల్లలు రోజూ వచ్చి, అందరి సమక్షంలో కొన్ని సర్గలు

రాముడు తన దూతలను పిలిచి, "మీరు వాల్మీకి మహాముని వద్దకు వెళ్ళి, సీత పవిత్రురాలైన పక్షంలో, ఆమె ఇక్కడికి వచ్చి ఆ సంగతి నిరూపించటానికి ఆ మహాముని అనుమతిని కోరుతున్నానని ఆయనతో చెప్పండి," అని పంపాడు.

దూతలు వచ్చి రాముడి కోరికను విన్నవించగానే వాల్మీకి మహాముని, "సీత రాముడి కోరిక ప్రకారం వచ్చి శపథం చేస్తుంది," అని చెప్పాడు.

దూతలు ఆ మాట చెప్పగానే రాముడు సభికుల ఎదట సీత తన పవిత్రతను వెల్లడించుకోబోతున్నదని ప్రకటించాడు. అందరూ ఈ మాటకు సంతోషించి, రాముణ్ణి అభినందించారు.

మర్నాడు తెల్లవారగానే రాముడు యజ్ఞవాటికకు వెళ్ళి, మహామును లందరికీ కబురు చేశాడు. రాక్షసులనూ, వానరులనూ, నానా దేశాల నుంచి వచ్చిన నాలుగు వర్ణాలవారినీ పిలిపించాడు. అందరూ కూర్చుని ఉండగా, వాల్మీకి వెనక అతి దీనంగా నడిచి వచ్చే సీతను

చూడగానే అందరికీ గుండెలు నీరయి పోయాయి.

వాల్మీకి రాముడితో, "రామా, ఈ సీత ఘన శీలవతి అయిన మహా ఇల్లాలు, ధర్మం తప్పనిది. లోకాపవాదుకు వెరచి ఈమెను నా ఆశ్రమం వద్ద వదిలిపెట్టావు. కనక నీకు ఆమె యందు విశ్వాసం కుదిరే టట్టుగా శపథం చేస్తుంది. ఈ బిడ్డ లిద్దరూ సీత కొడుకులు. నే నెన్నడూ అబద్ధ మాడినవాణ్ణి కాను. వీరు నీ కొడుకులు. నేను అంతులేని తపస్సు చేశాను. సీత నిజంగా చెడ్డదైతే, నా తపస్సు ఫలిం చకపోవుగాక! లోకాపవాదానికి వెరిచావే గాని ఆమెలో ఎలాంటి దోషం లేదని నీకూ తెలుసు. ఆ విషయం నే నెరుగుదును," అన్నాడు.



రాముడు వాల్మీకికి నమస్కరించి, "మునీశ్వరా, మీ రన్నది నిజమే. లంక లోనే అగ్నిదేవుడు సీత పవిత్రతకు సాక్ష్యం పలికాడు. అందుకే నేనిమెను నా వెంట ఇంటికి తెచ్చాను. ఈ పిల్లలు నా పిల్లలేనని కూడా నాకు తెలుసును. ఈ మహాసభలో సీత తన నిర్దోషిత్వం రుజువు చేసుకునేటట్టుంటే నే నామెను సంతోషంగా ఏలుకుంటాను," అన్నాడు.

కాషాయవస్త్రాలు ధరించి ఉన్న సీత చేతులు జోడించి, నేల చూస్తూ, "నా మనసులో రాముణ్ణి తప్ప మరెవరినీ స్మరించని పక్షంలో భూదేవి ఇప్పుడే నాకు దారి ఇచ్చుగాక! మనో వాక్కాయాల నేను రాముణ్ణి పూజించే దాన్నయితే భూదేవి నాకు దారి ఇచ్చుగాక! రాముడు తప్ప నా కింకేమీ తెలియని పక్షంలో భూదేవి నాకు దారి ఇచ్చుగాక!" అన్నది నెమ్మదిగా.

సీత ఇలా అంటూండగానే బలవంతు లైన నాగకుమారులు ఒక దివ్యమైన సింహాసనాన్ని మోస్తూ భూమిలో నుంచి పైకి వచ్చారు. సింహాసనం ఎంతో అద్భు తంగా ఉన్నది నాగకుమారుల తలలోని రత్నాలు వింతగా మెరుస్తున్నాయి. ఆ



''నే నింత కష్టం జీవితంలో ఎన్నడూ అనుభవించలేదు. ఓ భూదేవీ, నా సీతను నా కిచ్చెయ్యి, లేదా నాకు కూడా దారి ఇయ్యి. ఎవరురా, నా ధనుర్బాణాలు తెండి. ఈ భూమిని బద్దలు చేస్తాను,'' అని ఆవేశపడ్డాడు.

అందరూ చేరి అతన్ని ఎంతగానో ఓదార్చారు.

వాల్మీకి కుశలవులను వెంటబెట్టుకుని తన పర్ణశాలకు వెళ్ళాడు. ఆ రాత్రి వారికి సీతను గురించిన స్మరణలతోనే గడిచి పోయింది.

మర్నాడు మళ్ళీ సభ జరిగినప్పుడు కుశలవులు ఉత్తరరామాయణాన్ని గానం చేశారు. దానితోనే యజ్ఞకాండ ముగిసింది. యజ్ఞానికి వచ్చినవారి నందరినీ తగిన విధంగా సత్కరించి రాముడు అయోధ్యకు తిరిగి వచ్చాడు. అతను వచ్చేటప్పుడు తన కొడుకులను వెంట తెచ్చుకున్నాడు. అతను మరొక స్త్రీని పెళ్ళాడక, బంగారు సీతను పక్కనే ఉంచుకుని అనేక అశ్వమేధ, వాజపేయ యజ్ఞాలు చేశాడు. అతను ధర్మం నిలబెట్టటానికి యత్నిస్తూ, న్యాయంగా పరిపాలన చేసి, ప్రజల ఆదరం పొందాడు. అతని పరిపాలనలో దేశం సుభిక్షంగా ఉన్నది. అకాలమరణాలూ, ఈతి బాధలూ లేవు.

సింహాసనం మీద ఉన్న భూదేవి ఆప్యాయంగా తన రెండు చేతులూ చాచి సీతను ఎత్తి సింహాసనం మీద కూర్చోబెట్టింది. వెంటనే సింహాసనం పాతాళానికి దిగిపోయింది.

ఇది చూసి అందరూ నిశ్చేష్టితులయి పోయారు. కొందరు సీతనే చూస్తూ ఉండి పోయారు. మరికొందరు రాముణ్ణి చూశారు. ఆ తరవాత ఒక్కసారిగా కలకలం బయలుదేరింది. వానరులు ఏడ్చారు. ''ఎంత సాధ్వి!'' అని మునులు మెచ్చుకున్నారు.

రాముడు చేతికర్ర మీద బరువు వేసి తల వంచుకుని చాలాసేపు కన్నీరు గార్చి,

కాలక్రమాన కౌసల్యా, సుమిత్రా, కైకేయీ మరణించారు. వారికి రాముడు ఉత్తర క్రియలు చేసి, గొప్పగా దాన ధర్మాలు చేశాడు.

కొంతకాలం గడిచాక రాముడివద్దకు కైకేయి అన్న అయిన యుధాజిత్తు వద్ద నుంచి గార్గ్యుడు పదివేల గుర్రాల కానుకతో సహా వచ్చి, "రామా, మీ మామ నీతో ఇలా చెప్పమన్నాడు. సింధునదికి రెండు పక్కలా గల గంధర్వదేశం శోభతో కూడినది. అక్కడ శైలూషుడి సంతతికి చెందిన గంధర్వులు మూడుకోట్లమంది, మహా బలవంతులున్నారు. వారిని జయించి గంధర్వదేశాన్ని వశపరుచుకో. నీ హితం కోరి ఈ మాట చెప్పాను," అని యుధాజిత్తు తరఫున సందేశమిచ్చాడు.

అంతా విన్న రాముడు, "మంచిది. ఈ కుర్రవాళ్ళు భరతుడి కొడుకులు; తక్షుడూ, పుష్కలుడూ అనే వాళ్ళు. వీళ్ళ వెంట భరతుణ్ణీ, సేననూ పంపుతాను. భరతుడు గంధర్వులను జయించి, గంధర్వదేశాన్ని రెండుగా విభజించి, తన ఇద్దరి కొడుకులనూ వాటికి రాజులుగా చేసి తిరిగి వస్తాడు," అన్నాడు.

ఆ ప్రకారమే భరతుడు పెద్ద సేనను వెంటబెట్టుకుని పదిహేను రోజులు ప్రయాణం చేసి, కేకయదేశాన్ని చేరి,



యుధాజిత్తును కలుసుకున్నాడు. తరవాత ఇద్దరూ కలిసి గంధర్వుల మీదికి యుద్ధానికి వెళ్లారు. యుద్ధంలో గంధర్వులు నశించారు. భరతుడు వారి దేశాన్ని జయించి, తక్షుడికి తక్షశిల అనే నగరాన్నీ, పుష్కలుడికి పుష్కలావతి అనే నగరాన్నీ ఏర్పాటు చేసి, ఆ పట్టణాలలో అయిదేళ్ళపాటు ఉండి, ఆ తరవాత అయోధ్యకు తిరిగి వచ్చాడు.

ఇక లక్ష్మణుడి కొడుకులైన అంగదుడికీ, చంద్రకేతుడికీ రాజ్యాలు ఏర్పాటు కావలిసి ఉన్నది. వాళ్ళు ఏలదగిన దేశం ఏదన్నా ఉంటే చూడమని రాముడు లక్ష్మణుడితో అన్నాడు. కారుపథ మనే



చూడవచ్చానని రాముడితో చెప్పు.'' అన్నాడు.

లక్ష్మణు డా మాట చెప్పగానే రాముడు మునిని లోపలికి పంపమన్నాడు.

యముడు వచ్చి, రాము డిచ్చిన అర్ఘ్య పాద్యాలు స్వీకరించి, ''రామా, మనం ఏకాంతంగా మాట్లాడాలి. మనం మాట్లాడు కునేటప్పు డెవరైనా వచ్చేపక్షంలో నీవు వారికి మరణశిక్ష విధించాలి. అందు కిష్టమయే పక్షంలో నేను వచ్చిన పని చెబుతాను,'' అన్నాడు.

రాముడు సరేనని, లక్ష్మణుణ్ణి పిలిచి, ''లక్ష్మణా, ద్వారపాలకుణ్ణి పంపేసి, నువే ద్వారం వద్ద ఉండు. మేం మాట్లాడు కుంటుండగా ఎవరు లోపలికి వచ్చినా మరణదండన తప్పదు, జాగ్రత్త,'' అని చెప్పాడు.

తరవాత యముడు రాముడితో, ''రామా, నేను మారువేషంలో వచ్చిన యముణ్ణి, బ్రహ్మ పంపగా వచ్చాను. బ్రహ్మ నీతో ఇలా చెప్పమన్నాడు: నీవు రావణ సంహారం కోసం అవతరించిన విష్ణువువు. నీవు భూలోకానికి వచ్చిన పని అయిపోయింది. నీకు ఎప్పుడు తిరిగి రావా లని ఉంటే అప్పుడు తిరిగి రా,'' అన్నాడు.

రాముడు నవ్వి, ''నీ రాక నాకు చాలా సంతోషం కలిగించింది. నేను కూడా

దేశం అందుకు తగి ఉన్నదని లక్ష్మణు డన్నాడు. దాన్ని అంగదుడి కోసమూ, చంద్రకాంత మనే దేశాన్ని చంద్రకేతుడి కోసమూ ఏర్పాటు చేస్తే బాగా ఉంటుం దని నిర్ణయం జరిగింది. అంగదుడి వెంట లక్ష్మణుడూ, చంద్రకేతుడి వెంట భరతుడూ వెళ్ళి ఆయా దేశాలలో వారికి రాజ్యం ఏర్పాటుచేసి అయోధ్యకు తిరిగి వచ్చారు.

కాలం గడిచిపోయింది. ఒకనాడు యముడు మునివేషంలో రాముడి రాజ భవనానికి వచ్చి, లక్ష్మణుణ్ణి చూసి, ''లక్ష్మణా, వెంటనే వెళ్ళి నేను ఒక గొప్ప మహర్షి దూతగా రాముణ్ణి పని మీద

ఎక్కడి నుంచి వచ్చానో అక్కడికి వెళ్ళటానికి సిద్ధంగానే ఉన్నాను,'' అన్నాడు.

లోపల రాముడు యముడితో ఇలా మాట్లాడే సమయంలో దుర్వాసుడు వచ్చి, ''లక్ష్మణా, ఇప్పుడే నేను రాముణ్ణి చూడాలి,'' అన్నాడు.

''స్వామీ మా అన్న మరొక పనిలో నిమగ్నుడై ఉన్నాడు. కొంచెం ఆగాలి. మీరేం పని మీద వచ్చారో, నావల్ల మీకేం కావాలో చెప్పండి,'' అన్నాడు లక్ష్మణుడు.



దుర్వాసుడు ఉగ్రుడై, ''వెంటనే నన్ను రాముడి దగ్గిరికి తీసుకుపోకపోయావో మీ వంశమంతా నిర్మూలమయేటట్టు శపిస్తాను,'' అన్నాడు. తాను ఒక్కడే చచ్చినా నష్టం లేదనీ, సర్వనాశం కారాదనీ ఆలోచించి లక్ష్మణుడు లోపలికి వెళ్ళి రాముణ్ణి పిలిచాడు.

రాముడు లేచివచ్చి, దుర్వాసుడికి నమస్కరించి, ''స్వామీ, ఏమి ఆజ్ఞ?'' అని అడిగాడు.

''నాకు వెంటనే భోజనం పెట్టించు,'' అన్నాడు దుర్వాసుడు. రాముడాయనకు భోజనం పెట్టించాడు. దుర్వాసుడు భోజనం చేసి, సంతోషించి వెళ్ళిపోయాడు.

రాముడికి తన శపథం జ్ఞాపకం వచ్చి విచారం కలిగింది. లక్ష్మణుడతన్ని సమీపించి, ''అన్నా, నాకోసం దిగులు పడకు. నన్ను చంపి నీ మాట నిలబెట్టుకో,'' అని చెప్పాడు.

రాముడు తన మంత్రి పురోహితులను పిలిచి వారికి జరిగినదంతా చెప్పి వారి సలహా కోరాడు.

''రామా, లక్ష్మణుణ్ణి విడిచిపెట్టెయ్యి. త్యాగం వధతో సమానం, ధర్మభంగం కలగరాదు,'' అని వసిష్ఠుడన్నాడు.

లక్ష్మణుడు రాముడికి నమస్కారం చేసి, తన ఇంటికి కూడా పోకుండా, తిన్నగా సరయూ తీరానికి వెళ్ళి, శ్వాస స్తంభింపజేసి, యోగం పట్టాడు. ఇంద్రుడు విమానంలో అదృశ్యంగా దిగివచ్చి లక్ష్మణుణ్ణి శరీరంతో సహా స్వర్గానికి

తీసుకుపోయాడు.— విష్ణువులో నాలుగో భాగం తిరిగి వచ్చేసింది.

తరవాత రాముడు సభచేసి, "లక్ష్మణుడి లాగే నేను కూడా వెళ్ళిపోతాను. భరతుడికి పట్టాభిషేకం చేసే ఏర్పాట్లు చెయ్యండి," అన్నాడు.

ఆ మాట విని భరతుడికి మతి పోయినట్టయింది. "నువు లేని రాజ్యం నాకెందుకు? కుశలవులకు పట్టం కట్టు. కోసలకు కుశుణ్ణీ, ఉత్తర కోసలకు లవుణ్ణీ రాజును చెయ్యి. మనం స్వర్గానికి పోతున్నామని శత్రుఘ్నుడికి కబురు చేద్దాం," అన్నాడతను.

భరతుడన్న ప్రకారమే కుశలవుల పట్టాభిషేకం జరిగింది.

శత్రుఘ్నుణ్ణి పిలుచుకు రావటానికి మధురాపురానికి దూత వెళ్ళాడు. శత్రుఘ్నుడు తన రాజ్యాన్ని కూడా తన కొడుకులైన సుబాహుడూ, శత్రుఘాతీ అనేవాళ్ళకు పంచి అయోధ్యకు తిరిగి వచ్చాడు.

రాముడు స్వర్గానికి పోతున్నాడన్న వార్త విని సుగ్రీవ విభీషణులు సపరివారంగా అయోధ్యకు వచ్చేశారు. సుగ్రీవుడు అంగదుడికి పట్టాభిషేకం చేసి మరీ వచ్చాడు.

తరవాత రామప్రస్థానం ప్రారంభమయింది. రాముడు సన్నని బట్ట కట్టుకుని, చేత దర్భలు పట్టుకుని, మౌనంగా, గంభీరంగా నడవసాగాడు. అతని వెంట భక్తితో అంతఃపురస్త్రీలూ, భరత శత్రుఘ్నులూ, మంత్రులూ, భృత్యులూ, వానరులూ బయలుదేరారు.

కొంతదూరం నడిచి రాముడు సరయూ నదిని చేరాడు. రాముడు ఆ నదిలో పాదాలు పెట్టాడు. అతనికి లీలగా బ్రహ్మ పిలుపు వినబడింది. మరుక్షణమే రాముడికీ, భరత శత్రుఘ్నులకూ వైష్ణవ శరీరాలు వచ్చేశాయి. విష్ణువు బ్రహ్మను చేరాడు. అతనితోబాటు అవతరించిన వారందరూ క్రమక్రమంగా తమతమ లోకాలకు తిరిగి చేరుకున్నారు. —(సంపూర్ణం)





# కోటీశ్వరుడు

కంచిలో ఒక వైశ్యుడుండేవాడు. అతను వర్తకం చేసి అంతులేని డబ్బు సంపాదించి, కోట్లు గడించి, నవకుబేరు డనే పేరు పొందాడు. అతనికి అనేకమంది కొడుకులూ, కూతుళ్లూ కలిగారు. అతను వారందరికీ పెళ్ళిళ్ళు చేసి, అల్లుళ్ళను కూడా తన వద్దనే ఉంచుకుని, వాళ్ళకు కూడా పనులు కల్పించి, తన వర్తక వ్యాపారాలను ఇంకా .పెంచుకున్నాడు. కాలక్రమాన అతని బంధుకోటి పెరిగి, అతని ఇల్లు ఒక దివాణంగా మారి పోయింది. బంధువుల మధ్య అతను అత్యంత వైభవంతో జీవిస్తూ రాజయోగంగా అనుభవించాడు.

అయితే నవకుబేరుడు తన ఇల్లు దాటితే పరమలోభి. అతను దాన ధర్మాల కిందగాని, తీర్థయాత్రలకని గాని, ఏనాడూ చిల్లిగవ్వ ఖర్చుపెట్టి ఎరగడు.

ఇలా ఉండగా ఒకనాడు నవకుబేరుడి ఇంటి ముందు ఒక బైరాగి వచ్చి నిలబడి, తన కా పూట భోజనం పెట్టించమన్నాడు.

"పోరా, దొంగవెధవా! నువ్వెక్కణ్ణించి ఊడిపడ్డావు!" అని నవకుబేరుడు చీదరించుకున్నాడు.

"నేను దొంగనైతే బిచ్చమెత్తుకునే కర్మేమిటి?" అన్నాడు బైరాగి.

ఇద్దరికీ కొంచెంసేపు వాదన జరిగిన మీదట, ఆ బైరాగివాడు తన కాలం వృథా చేస్తున్నాడని కోపం వచ్చి, నవకుబేరుడు అతన్ని తన నౌకర్లచేత బయటికి గెంటించాడు. బయటికి గెంటినా ఆ బైరాగి, స్వయంపాకం ఇస్తేనేగాని వెళ్ళనని భీష్మించుకుని, సాయంకాలందాకా ఇంటి కెదురుగా కూర్చున్నాడు.

"నువ్విక్కడే చచ్చినప్పటికీ నేను స్వయంపాకం ఇవ్వను. ఎంతకాలం



కూర్చుంటావో కూర్చో." అన్నాడు నవకుబేరుడు.

ఆ బైరాగి మూడు పగళ్ళూ, మూడు రాత్రులూ వీధి వాకిలి కెదురుగా అలాగే కూర్చున్నాడు. ఆ బైరాగి శపిస్తాడేమోనని అప్తులు నవకుబేరుడితో అన్నారు. కాని అతను భయపడలేదు, వీధి తలుపు మూయించి మరొక దారిన రాకపోకలు ఏర్పాటు చేసుకున్నాడు.

కొన్ని రోజుల అవతల చూస్తే బైరాగి ఎటో వెళ్లిపోయాడు. తానొక ఘనవిజయం సాధించినట్టు నవకుబేరుడు సంతోషించాడు. కాని వీధి వాకిలి తెరిచిన మర్నాడే మళ్ళీ బైరాగి ప్రత్యక్షమయాడు.

"ఈ బైరాగి నన్ను శనిలాగా పట్టాడే! మళ్ళీ ఎందుకు వచ్చాడో కనుక్కురా." అని నవకుబేరు డొక మనిషిని పంపాడు.

"నేను నిన్నేమీ యాచించటానికి రాలేదు. నీతో కొంచెం మాట్లాడాలి," అని బైరాగి నవకుబేరుడికి కబురు చేశాడు.

ఆరు నెలల దాకా తనకు తీరదని నవకుబేరుడు జవాబు పంపాడు. బైరాగి వెళ్ళిపోయి, సరిగా ఆరు నెలలకు మళ్ళీ వచ్చాడు. నవకుబేరుడు మరి కొన్ని వాయిదాలు వేశాడు. బైరాగి ఎంతో ఓపికగా వాయిదానాటికి వస్తూవచ్చాడు. ఇలా ఏడాది గడిచింది. ఆ బైరాగి చెప్పేది తాను వినక తప్పదనుకుని చివరకు నవకుబేరుడు అతన్ని పిలిపించాడు.

"ఏడాది నుంచీ చూస్తున్నాను. నువు మాయచేత కప్పబడి, ఈ భార్యాపుత్రులనూ, బంధువులనూ నమ్ముకుని గుడ్డివాడివై పోయావు. కళ్ళు తెరిచి నిజం తెలుసుకో!" అన్నాడు బైరాగి.

"అయినవాళ్ళందరినీ వదులుకోమని చెప్పటానికేనా ఇంతకాలమూ నా చుట్టూ తిరిగావు?" అని నవకుబేరు డడిగాడు.

"వీళ్ళలో నీకు నిజంగా అయినవాడు ఒక్కడూ లేడు. నువు సంపాదించి పెట్టుతున్నంతకాలమూ వీళ్ళు నీకు బ్రహ్మరథం పడతారు. ఆ తరవాత నిన్ను

జీవచ్ఛవంగా చూస్తారు. కావలిస్తే ఈ మాట రుజువు చేస్తాను,'' అన్నాడు బైరాగి.

అందుకు వైశ్యుడు కూడా ఒప్పుకున్నాక, బైరాగి ఒక ఉపాయం చెప్పి వెళ్ళి పోయాడు.

తరవాత కొద్ది రోజులకు ఒకనాటి రాత్రి నవకుబేరుడు హఠాత్తుగా తన కేదో అపాయ కరమైన రోగం సంప్రాప్తమైనట్టు నటించాడు. ఆయన తన భార్యతో, ''నాకు చావు దగ్గిర పడింది. ఇన్నాళ్ళు బతికాను గాని, ఒక్క పుణ్యకార్యం చెయ్యటానికి కూడా నాకు వ్యవధి చిక్కలేదు. ఈ చావు ఇంకొక్క ఏడాది ఆగి వస్తే ఎంతో బాగుండేది,'' అంటూ ఉన్నపాళంగా బిర్ర బిగుసుకు పోయాడు.

నవకుబేరుడి భార్య కంగారుపడి వైద్యుణ్ణి పిలిపించింది. వైద్యుడు పచ్చి పరీక్షచేసి, రోగం అంతు చిక్కక, తాను చేసేదేమీ లేదని చెప్పి వెళ్ళిపోయాడు. నవకుబేరుడు బైరాగి చెప్పిన విధంగా ఊపిరి బిగబట్టి ప్రాణం పోయినట్టు నటించాడు.

అతని మీద పడి తింటున్నవారు దాదాపు రెండు వందలమంది ఉన్నారు. వాళ్ళంతా నవకుబేరుడి చుట్టూ చేరి శోకాలు పెట్టసాగారు. కొందరు శ్మశాన వైరాగ్యం చెప్పి, ఎంత వారికీ చావు తప్పదన్నారు.

సరిగా అదే సమయానికి బైరాగి ఒక లోటాలో పాలు తీసుకుని అక్కడికి వచ్చి,



అందరినీ ఊరుకోమని సైగ చేసి, ''ఈ చచ్చిపోయిన మనిషిని బతికించుకోవాలని మీలో ఎవరికైనా కోరిక ఉన్నట్టయితే చెప్పండి. ఇదుగో సిద్ధౌషధం!'' అన్నాడు గంభీరంగా.

నవకుబేరుడి భార్య మొదలైన వాళ్ళు ఆ బైరాగి కాళ్ళ మీద పడి, ''బాబూ, రక్షించండి. మీరేం కోరితే అది యిస్తాం. అయన కా సిద్ధౌషధం యిచ్చి బతికించండి.'' అని ప్రాధేయపడ్డారు.

దానికా బైరాగి, ''వెర్రివాళ్ళలారా, ఎంత సిద్ధౌషధమైనా ఆయువు మూడిన వారికి ఆయుర్దాయం ఇవ్వగలదా? ఈ ఔషధం మీల్లో ఎవరైనా తాగినట్టయితే వారు వెంటనే చచ్చిపోతారు. వారి ఆయుశ్శేషంతో ఈ చనిపోయిన మనిషి కొంత కాలం బతుకుతాడు. అతనికి తమ ఆయువు నివ్వటానికి సిద్ధంగా ఉన్నవాళ్లు ముందుకు వచ్చి ఈ ఔషధం తీసుకుని తాగెయ్యండి; అతను బతుకుతాడు.'' అన్నాడు.

ఎవరూ పలకలేదు. కొంచెంసేపు చూసి బైరాగి, ''ఇంటి నిండా వున్న మీలో ఎవరూ ఈ మనిషికోసం చావరా?'' అని అడిగాడు. జవాబు లేదు.

''అయ్యో, ఈ మనిషి తన జీవితమంతా వీళ్ళందరినీ సుఖపెట్టటానికి ధార పోసి, పరలోకంలో సుఖపడటానికి ఒక్క పుణ్యకార్యమైనా చెయ్యకుండా చనిపోయాడే! ఒక్కరైనా అతని కోసం తమ ప్రాణాల నివ్వకుండా ఉన్నారే!" అన్నాడు బైరాగి.

''స్వామీ, కళ్ళు తెరుచుకున్నాయి!'' అంటూ నవకుబేరుడు లేచి కూర్చున్నాడు. అందరూ నిర్ఘాంతపోయి, నిశ్చేష్టులయారు.

ఆ తరవాత నవకుబేరుడు పనికిమాలిన తన బంధువుల నందరినీ వెళ్ళగొట్టి, తనకు గల అంతులేని సంపదను దాన ధర్మాలకు వినియోగిస్తూ, వర్తకమంతా కొడుకుల పరం చేసి పవిత్రమైన జీవితం గడిపాడు.





# అపకారికి ఉపకారం

## 8

పరదేశి, గ్రామస్థులను వెంటబెట్టుకుని గ్రామ పెద్దల వద్దకు బయలుదేరాడు. అంతమంది జనంతో వచ్చిన పరదేశిని చూసి, జయవిజయులు భయపడ్డారు.

"మేమంతా ఒకసారి, మా పెద్దల్ని చూడాలి!" అన్నారు గ్రామస్థులు ఏకకంఠంగా.

"ఎందుకు?" అని అడిగాడు జయుడు.

"ఈ పరదేశి తాను మహావిష్ణువు నంటున్నాడు. అదెంతవరకు నిజమో, పెద్దల్నడిగి తెలుసుకోవాలి. పెద్దలు నిజంగా యీాయన మహావిష్ణువే అంటే, మేమంతా కలిసి ఇప్పుడే మిమ్మల్ని హత మారుస్తాం," అన్నారు గ్రామస్థులు.

జయవిజయులు భయకంపితులై పోతూ, లోపలికి వెళ్లి, పెద్దలిద్దరికీ సంగతి చెప్పి, "మీరిప్పుడు మాకు సాయపడాలి. ఆ పరదేశి మహావిష్ణువని చెప్పారో, మేము మీ కళ్ళ ఎదుటే ఆత్మహత్య చేసుకుంటాం," అన్నారు.

పెద్దలిద్దరూ ఏం చేయాలో తోచక ఒక్క క్షణం తికమకపడి కాసేపు ఊరుకుని, "మీరు మమ్మల్ని చాలా చిక్కు సమస్యలో పడేశారు. ఒకసారి మమ్మల్ని ప్రియంవదతో మాట్లాడనివ్వండి." అన్నారు.

జయవిజయులు, పెద్దలిద్దర్నీ దాపుల నున్న ఒక ఇంటికి తీసుకుపోయి, అక్కడ వున్న ఒక గది తలుపు తెరిచారు. గది అంతా చిమ్మచీకటిగా ఉన్నది. ఒక చాప మీద దుఃఖిస్తూ ప్రియంవద కూర్చుని వున్నది.

"వసుంధర"

పెద్దలిద్దరూ ఎంతో విచారంగా గది లోపలికి వెళ్ళారు. ప్రియంవద ఒకసారి తల ఎత్తి వాళ్ళను చూసి తలదించు కున్నది. అప్పుడామె ముఖం చూసిన పెద్ద లిద్దరికీ చాలా బాధకలిగింది.

''అమ్మా, ప్రియంవదా, మా కారణంగా నీకు ఎక్కడలేని కష్టాలూ దాపురించాయి. నీ దుఃఖం మేము చూడలేము. మా బిడ్డల ప్రాణాలు పోయినా సరే, నిన్ను రక్షించు కుంటాము,'' అన్నారు పెద్ద లిద్దరూ.

ప్రియంవద ఏమీ మాట్లాడలేదు.

పెద్దలిద్దరూ, ఆమెకు జరిగినదంతా చెప్పి, ''జయవిజయులు చాలా మొండి వాళ్ళు. అన్నంత పనీ వాళ్ళు చేయగలరు. అయినా సరే, నీక్షేమం కోరి, ఆ పరదేశి మహావిష్ణువే అని చెప్పదలిచాం,'' అన్నారు.

''అయితే, నాదగ్గిరకెందుకొచ్చారు?'' అని అడిగింది ప్రియంవద విసుగ్గా.

"నీ రూపం, గుణగణాలూ చూస్తూంటే, నువ్వు దేవతవే అనిపిస్తున్నది. నీలో చాలా అద్భుత శక్తులున్నాయి. నువ్వు తలుచుకుంటే, జయవిజయుల్ని హత మార్చగలవు. కాని, నువ్వు మా బిడ్డల్ని, మాచేతనే చంపించాలని సంకల్పించావు. ఈ కడుపుకోత భరించలేము. మా బిడ్డలు మూర్ఖులైతే, వాళ్ళనుంచి ఆ మూర్ఖత్వాన్ని తొలగించు. అంతేకాని, వాళ్ళ ప్రాణాలే తీయాలనుకోకు,'' అన్నాడు చిన్నపెద్ద దీనంగా.



''మీ పిల్లల మూర్ఖత్వానికి పాలుపోసి పెంచింది. మీరు. చిన్నతనంలో, మీరు వాళ్ళను అదుపుచేసి వుండవలసింది. మొక్కై వంగనిది, మానై వంగదుకదా!'' అన్నది ప్రియంవద.

''ఈ సామెతలు, మాబోటి సామాన్యులకు కాని, నీబోటి దేవతలకు కాదు. నువ్వు తలచుకుంటే, మా బిడ్డల ప్రాణాలు పోకుండా, నువ్వు పరదేశిని పెళ్ళి చేసుకునే ఉపాయం చెప్పగలవు.'' అన్నాడు చిన్నపెద్ద మళ్ళీ.

ప్రియంవద, "నేనే ఉపాయమూ చెప్పక పోతే, మీరేం చేస్తారు?'' అని అడిగింది.

''ఆ పరదేశి శ్రీ మహావిష్ణువు అవతారం అని, గ్రామస్థులకు చెప్పేస్తాం. మేము యిలా చెప్పగానే, మా బిడ్డలు విషం తాగి ప్రాణాలు తీసుకుంటారు.'' అన్నాడు పెద్దపెద్ద.

''మీ బిడ్డల ప్రాణాల కేప్రమాదమూ లేదు. అందుకు, నేనొక ఉపాయం ఆలోచించాను,'' అన్నది ప్రియంవద.

ఆమె, వాళ్ళకు ఆ ఉపాయమేదో వివరించింది. పెద్దలిద్దరూ శ్రద్ధగా విని, గదినుంచి బయటికి వచ్చారు.

ఇంటిముందు గ్రామస్థులందరూ కుదురుగా కూర్చుని వున్నారు. వాళ్ళ మధ్య పరదేశి కూడా వున్నాడు. పెద్దలు, తను అవతారపురుషుడు కాదంటే, గ్రామస్థులు తననేం చేస్తారో అని, అతడు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.





జయవిజయులు జనానికి ఒక పక్కగా కూర్చుని, తమ తండ్రులు ఏం చెప్ప బోతున్నారో వినేందుకు ఆత్రుతగా ఎదురు చూస్తున్నారు. ఇద్దరి చేతుల్లోనూ విషం పాట్లాలున్నవి.

పెద్దపెద్ద గొంతు సవరించుకుని, "నా గ్రామస్థులారా! మన గ్రామానికి వచ్చి, మనకెంతో సాయపడినపరదేశిలో, అవతార పురుషుడి లక్షణాలు చాలా వున్నవి కాని, అంతమాత్రాన అతణ్ణి, అవతారపురుషు డనలేం. అతడు తన మహిమలు రుజువు చేసుకోవాలి. అందుకొక చక్కని ఏర్పాటు చెబుతాను," అని, అదేమిటో వారికి వివరించాడు.

సమీపారణ్యంలోనికి పరదేశినీ, ప్రియం వదనూ తీసుకుపోవాలి. వాళ్ళిద్దరూ వున్న చోటుకు వెయ్యి గజాలదూరంలో, గ్రామస్థులందరూ చుట్టూ కాపలాగా వుంటారు. వంద అంకెలు లెక్కపెట్టే లోగా, పరదేశి, ప్రియంవదతో సహా మాయం కావాలి. అలా మాయం కాలేని పక్షంలో, ప్రియంవద జయవిజయులను పెళ్ళి చేసుకుంటుంది. పరదేశి గ్రామం వదిలిపోతాడు.

ఈ ఏర్పాటు గ్రామస్థులందరికీ బాగా నచ్చింది. చుట్టూ వేయి గజాలదూరంలో మనుషులు కాపలా వుండగా, పరదేశీ, ప్రియంవదా ఎలా తప్పించుకుపోగలరు? అదీ వంద అంకెలు లెక్కపెట్టేలోగా!

ప్రియంవద మాకు భార్య కాక తప్పదు; పరదేశి గ్రామం విడిచిపోకనూ తప్పదు— అనుకుని జయవిజయులు చాలా సంతో షించారు. అయితే, ప్రియంవద తను వచ్చిన చెట్టుబోదెలోని మార్గం ద్వారా, తిరిగి రాజభవనంచేరుకోవాలనుకుంటున్న దని, వాళ్ళకు తెలియదు!

ఆ తర్వాత పెద్దలిద్దరూ చెప్పిన విధంగా ఏర్పాట్లు జరిగాయి.

"పరదేశి అవతారపురుషుడని, నాకు తెలుసు. మేమిద్దరమూ యిక్కడి నుంచి మాయమై, కొంతకాలం ఆకాశయానం

చేస్తాము. అక్కడ మీ ఆతిథ్యం గుర్తు చేసుకునేందుకు వీలుగా, మాకు కొన్ని ఆహారపదార్థాలు యివ్వండి,'' అని ప్రియంవద గ్రామస్థులను కోరింది.

గ్రామస్థులు, అదే విధంగా ప్రియంవదకూ, పరదేశికీ కొన్ని ఆహారపదార్థాలు మూటకట్టి యిచ్చారు.

అరణ్య మధ్యంలో, ప్రియంవద కోరిన చోట, ఆమెనూ, పరదేశినీ వదిలారు. గ్రామస్థులు, వాళ్ళకు కాపలా కాసేందుకు వెయ్యి గజాలదూరంలో నిలబడేందుకు బయలుదేరుతూండగా, పరదేశి వాళ్ళతో యిలా అన్నాడు:

''మీరిప్పుడు వెయ్యి గజాల దూరం వెళ్ళి, వంద అంకెలు లెక్కబెడతారు. ఆ తర్వాత మేమిద్దరమూ, మీకు కనిపించం. అంటే, నేను విష్ణు అవతారమే కదా! మళ్ళీ మీకు కనబడను కాబట్టి, నా ఆదేశం చెబుతున్నాను. ప్రజాబలం, ప్రభుబలం కంటే గొప్పది. ఎవరు మీకు అన్యాయం తలపెట్టినా సహించకండి. అంతా ఏకమై, ఆ అన్యాయాన్ని ఎదిరించండి. జయవిజయులు, మీకంటే శక్తిమంతులు కారు. వాళ్ళలో వున్న జయవిజయుల రాక్షసాంశను, నేను తీసుకుపోతున్నాను. వాళ్ళను, మీ శక్తితో లొంగదీయండి. ఇంతకాలం మిమ్మల్నేలిన, మీ గ్రామ పెద్దలిద్దరూ, అన్ని విషయాల్లోనూ, మీకు సాయపడతారు. వెళ్ళండి, మీకు శుభం కలుగుతుంది!''

గ్రామస్థులందరూ వెళ్ళిపోయారు. పరదేశీ, ప్రియంవదా మాయం కావాలని గ్రామ పెద్దలిద్దరూ కోరుకున్నారు. వాళ్ళు మాయం కావడం అసాధ్యమని జయవిజయులు అనుకున్నారు.

గ్రామస్థులు కనుమరుగు కాగానే, ప్రియంవద పరదేశిని, తిన్నగా సొరంగ ద్వారం వున్న చెట్టు దగ్గిరకు తీసుకుపోయింది. ఇద్దరూ కలిసి చెట్టుబోదెలో వున్న ద్వారం తలుపు తెరిచి, సొరంగంలో ప్రవేశించి, తలుపుకు లోపలినుంచి గడియ బిగించారు.—(ముగింపు వచ్చేసంచికలో)



# నిజాయితీ

పోలవరం జమీందారు దివాణం కాపలాకాయడానికి, నౌకరును నియమించాలనుకున్నాడు. అది తెలిసి ఆనందుడు, సునందుడు అనే యువకులిద్దరు వచ్చారు. జమీందారు, ఆనందుణ్ణి, ఆ రాత్రి దివాణం కాపలాకాయమన్నాడు.

మర్నాడు జమీందారు, వాణ్ణి సాయంత్రందాకా తోటలో మొక్కలకు నీళ్ళుతోడి, కలుపు తీసి వెళ్ళమన్నాడు. ఆ పనులు వాడు సునాయాసంగా చేశాడు. జమీందారు, వాడితో కాపలా పని యిచ్చేదీ లేనిదీ నాలుగు రోజుల్లో కబురు పెడతానని చెప్పాడు.

ఆ మరుసటిరోజున జమీందారు, సునందుణ్ణి కాపలా పనికి నియోగించి, మర్నాటి ఉదయం, ఆనందుడికి చెప్పినట్టే తోటపని చూడమని చెప్పాడు. అయితే, వాడు తోటపని చేస్తూ మధ్య, మధ్య కునికిపాట్లు పడుతూండడం, జమీందారు గమనించాడు.

జమీందారు, సునందుడితో, "నీకు దివాణం కాపలాకాసే పని ఖాయంచేశాను. ఆనందుడు నీలాగాకాక, తోటపని ఏ కునికిపాట్లూ పడకుండా సునాయాసంగా చేశాడు. అంటే, వాడు ఆ రాత్రి దివాణం కాపలా కాయడం సరిగా చేయక నిద్రపోయాడన్నమాట. నాకు కావలసింది, చెప్పిన పని నిజాయితీగా చేసేవాడు!" అన్నాడు.

—రాంబాబు.





# తగినవారసుడు

రంగాపురం మునసబు సుబ్బయ్య, పరమ పిసినారే కాక, తగువులమారి మనిషి కూడా. ఇందుకు తగ్గట్టు—నిప్పుకు, గాలి తోడయినవిధంగా, అతడి భార్య సుబ్బమ్మ కూడా అలాంటిదే కావడంతో, వాళ్ళకు డబ్బు కూడబెట్టడం తప్ప, మరొక వ్యాపకం వుండేదికాదు.

సుబ్బయ్య, గ్రామంలో ఎవరెవరికి ఎలా పొలం తగువులు పెట్టాలో, ఎవరికెలా న్యాయస్థానానికి పొమ్మని సలహాలివ్వాలో కూడా చేస్తూండేవాడు. ఎవరైనా డబ్బు యిబ్బందిలో వున్నారని తెలిస్తే, వాళ్ళ దగ్గిరకు వెళ్ళి, ధర్మవడ్డీ అంటూ దొంగలెక్కలు రాసి, యిచ్చినదానికి మూడంతలు వసూలు చేసేవాడు.

సుబ్బమ్మ కూడా రకరకాల చిన్న వస్తువులు, చెంబూ, తప్పేళా లాంటివి తాకట్టు పెట్టుకుని, డబ్బు వడ్డీలకిస్తూండేది.

ఇలాంటి దంపతులకు, వివాహమైన పాతికేళ్ళకు పండంటి మగపిల్లవాడు కలిగాడు. భార్యాభర్త లిద్దరూ, వారసుడు పుట్టాడని ఎంతగానో ఆనందించారు.

సుబ్బమ్మకు యింటి పక్కల అమ్మలక్కలు, "ఇన్నాళ్ళకు మగపిల్లవాడు పుట్టాడు. బారసాలచేసి, నలుగురినీ పిలిచి విందుభోజనాలు పెట్టండి," అన్నారు.

ఈ సలహా గురించి భార్యాభర్తలు దీర్ఘంగా ఆలోచించారు. పిల్లవాడి బారసాలతోపాటు, తమ వివాహ రజతోత్సవం కూడా జరుపుకుంటున్నామని, నలుగురినీ పిలిస్తే, అటు పిల్లవాడికీ, యిటు తమకూ, అతిధుల నుంచి బహుమతులు రాగలవన్న ఆశకలిగింది.

ఈ పథకం ప్రకారం సుబ్బయ్య, గ్రామస్థులందరికీ ఘనంగా విందుభోజనం ఏర్పాటు చేశాడు. అయితే, సుబ్బయ్య

ఎం. డి. సౌజన్య

దంపతుల దురాలోచన అర్థమైన గ్రామ ప్రజలు, ఉయ్యాలలో వున్న పసివాడికే బహుమతులన్నీ యిస్తూ, "పాతికేళ్ళకైనా పండంటి బాబు పుట్టాడు. అందుకే, వీడికి యీ ఉంగరం!" అంటూ, అందరూ ఉంగరాలే బహుమతులుగా యిచ్చారు.

విందు ముగిశాక, రాత్రి సుబ్బయ్య దంపతులు, వచ్చిన బహుమానాల విలువ అంచనా కట్టేందుకు కూర్చున్నారు. విందుకు పెట్టిన ఖర్చుపోగా, ఎంత గిట్టుబాటు అయిందో లెక్కకట్ట సాగారు.

ఆ సమయంలో సుబ్బయ్యకు, చిన్న అనుమానం కలిగింది. అతడు ఆకురాతి మీద ఒక బహుమతి ఉంగరాన్ని అరగదీసి, "అయ్యో, కొంప మునిగిందే!" అంటూ, మరి కొన్ని ఉంగరాలను అలాగే చేసి, "అన్నీ నకిలీ బంగారపుటుంగరాలు! దిక్కుమాలినమంద పొట్టలు పగిలేలా తిని, బహుమతి పేరుతో యిచ్చిపోయిన వన్నీ, గుడ్డిగవ్వ ఖరీదు చేయని నకిలీవి," అన్నాడు బాధగా.

"ఇంత పచ్చిమోసమా!" అంటూ సుబ్బమ్మ పెద్దగా అరిచి, ఏదో అనుమానం రాగా గబగబా పోయి, ఇల్లంతా తిరిగి భర్త దగ్గరకు వచ్చి, "పాడు జనం, తిన్నంత తినిపోతూ, పైగా నా దగ్గిర తాకట్టు పెట్టిన వస్తువులు తలా ఒకటి పట్టుకుపోయారు," అంటూ నెత్తి కొట్టుకో సాగింది.

ఇలా భార్యాభర్తలు బాధపడుతూండగా, ఉయ్యాలలోని పసివాడు ఏడుపు మొదలు పెట్టాడు.

సుబ్బమ్మ, పిల్లవాణ్ణి ఎత్తుకుని లాలిస్తూ, వాడి గుప్పెట గట్టిగా బిగిసి వుండడం చూసి, దాన్ని తెరిచి ఆశ్చర్యపోయింది.

వాడి గుప్పెటలో ఎవరిదో రెండు పేటల బంగారు గొలుసున్నది. భార్య పిలవగా సుబ్బయ్య వచ్చి, ఆ బంగారు గొలుసును చూసి పరమానందంతో, "పోనీలేవే! మనం చేయడానికి వీలులేనిపని, మన అబ్బాయి చేశాడు. వీడు మనకు తగిన వారసుడు!" అన్నాడు.



ఉత్తర, దక్షిణ ధ్రువప్రాంతాలలో, ఉత్తర జ్యోతులు (అరోరా బొరిలిస్), దక్షిణ జ్యోతులు (అరోరా ఆస్ట్రాలిస్) అనే కాంతులు కనిపిస్తాయి. సూర్యుడి నుంచి వెలువడే విద్యుత్ పూరిత కణాలు, ధ్రువ ఉపరితలం మీది భూమి అయస్కాంత క్షేత్రాన్ని కలుసుకోవడంవల్ల ఈ కాంతులు వెలువడుతున్నవి।






## చల్లటి ఎలుగు బంట్లు!

ఆస్ట్రేలియాలోని కోలాఎలుగు బంట్లు వేసవిలో, నోటిలోని లాలాజలాన్ని ఒంటిమీద రాసుకుని, వెలుపలి వేడినుంచి తమను కాపాడుకుంటాయి।

## ఎడారి వాన

ఎడారి ప్రాంతాలలో తరచూ వర్షం కురిసినా, నేల మాత్రం పొడిగానే వుంటుంది. ఎడారి ఉపరితలంమీది గాలి వేడిగా వుండడంవల్ల, వాన చినుకులు భూమిని చేరుకునేలోపలే గాలి వేడికి ఆవిరిగా మారిపోతాయి।



# హార్లిక్స్ బిస్కెట్లు వున్నాయి ఈ జాడీలో లెక్కపెట్టండి ఎన్ని వున్నాయో అందులో.

జవాబు : 15 బిస్కెట్లు




## హార్లిక్స్ బిస్కెట్స్

హార్లిక్స్ లోని పోషకాలు నిండిన కరకర గరగర బిస్కెట్!

HTA 5030 TEL C

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1987 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



D. Jagadish Babu



Sundara Murthy

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఆగస్టు నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఏడుపన్నది మానరా! రెండవ ఫోటో: ఎల్లకాలం నవ్వరా!

పంపినవారు: వక్కలంక రామారావు, మాచవల్లి – 533551 (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.

చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

---


Parry's

# మీ భవిష్యత్తును తీర్చిదిద్దే
# మీ నోట్‌పుస్తకం ఏ కాగితంతో చేసినదైనా ఫర్వాలేదా?



## .... ఆఁ! మీరు కాదంటారని మాకు తెలుసు!

అత్యంత ముఖ్యమైన విషయాలను పొందుపరచుకొని
మీ బంగారు భవిష్యత్తును రూపొందించుకొనే మీ నోట్‌పుస్తకాల
కోసం మేమెంతగానో శ్రమించి అన్ని విధాల మీరు
మెచ్చుకొనే విధంగా తయారు చేశాం – ఈ శ్రీ నోట్‌పుస్తకాలు!

శ్రీ నోట్‌పుస్తకాలలోని కాగితం ఎంతో శ్రేష్ఠమైనది మరియు
అధిక నాణ్యత కలది. వాడకంలో ముడుతలు పడవు. సిరాను
పాకనివ్వదు. రూళ్ళు తిన్నగా ఉంటాయి.

శ్రీ నోట్‌పుస్తకాల విస్తృత శ్రేణి చూడండి – రూళ్లవి. ఒకవైపు
రూళ్లూ, రెండోవైపు ఖాళీగా ఉండేవి. రూళ్ళు లేనివి. చదరపు
గళ్లవి లేదా గణితం కోసం ప్రత్యేకమైనవి. ఇంకా ఎన్నెన్నో!
అతి సరసమైన ధరల్లో లభిస్తున్నాయి

**SREE**
NOTE BOOKS





శ్రీ రాయలసీమ పేపర్ మిల్స్ లిమిటెడ్
ఆదోని-518 301 ఆంధ్ర ప్రదేశ్

ULKA-H/SRPM/1287/TEL

వ్యాపార వివరములకు సంప్రదించండి:
**శ్రీరాయలసీమ పేపర్ మిల్స్ లిమిటెడ్**
5-8-512, చిరాగ్ అలిలేన్, హైదరాబాద్-500 001

మీరు దీనితో చేయగలిగే అద్భుతాలు ఎన్నెన్నో!

క్రొత్త

# కేమ్లికాల్-86

## ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్ అడ్హైసివ్

కొన్ని రంగు-రంగు వస్తువుల, కళాత్మక వస్తువుల ముక్కలు....
ఒక ట్యూబ్ కేమ్లికాల్-86....వీటికి తోడు మీ ఊహాశక్తి.
ఇవన్నీ చేరితే తయారవుతాయి ఎన్నెన్నో అద్భుతాలు!

విరిగిన బొమ్మలు అతకాలన్నా, ఆట వస్తువులు జోడించాలన్నా... ఒక్కటేమిటి త్రీ-డి గ్రీటింగ్ కార్డ్లు....తోరణాలు....గోడలను అలంకరిస్తూ వేలాడే అందమైన వస్తువులు....చైనా లాంతర్లు....క్రిస్ట్‌మస్ ట్రీలు....గాలి పటాలు, నమూనాలు....కృత్రిమ ముఖాలు, అందమైన జపాను విసన కర్రలు, అందమైన ర్యాపింగ్ పేపర్‌లో కానుకల ప్యాకింగ్‌లు, ఫోటో ఫ్రేములు....
ఫర్నిచరు, పిక్చర్లు, ఇంటి వస్తువులు నరిచేసుకోడానికి....




మేలైన అడ్‌హెసివ్



కేమ్లిన్ ప్రై. లి. స్టేషనరీ డివిషన్, బొంబాయి-400 059.

C-TEL 2

నాపేరు
చాకో-క్రీమ్!




"ఇటు గొడవ,
అటు సంరంభం...
తినండి టాఫీలు,
చెయ్యకండిక ఆలశ్యం!!"




Ravalgaon
Double Trouble
Toffees

